# మా మాట

మాయల్ ఖైరాబాదీగారు చిన్న పిల్లలకు, మహిళలకు బాగా నచ్చేలా కథలు వ్రాయడం, వ్యాసాలు వ్రాయడంలో దిట్టలు. ఆయన 1958లో వ్రాసిన ఓ సంస్కరణాత్మక కథకు ఇది తెలుగు అనువాదం. 1964–65 మధ్యన నెల్లూరు నుండి వెలువడిన మాసపత్రిక 'విజ్ఞానచంద్రిక'లో ఈ ఉత్తరాలు ముందు ప్రచురించబడ్డాయి. ఇప్పుడు ఆలస్యంగానయినా సరే సంస్కరించి ప్రచురించగలుగుతున్నందుకు సంతోషంగా ఉంది. తెలుగు ప్రజలు, ముఖ్యంగా మహిళలకు ఇది బాగా నచ్చుతుందని నమ్ముతున్నాము.

— ప్రకాశకులు

పెట్టుకుంటే ఎంత బాగుంటాయ్ అనుకున్నాన్!" అని మారాం చేస్తుంది. పాపం ఆ అమాయకురాలు.

నేనేదో విధంగా రజియాను సరిపెట్టుతున్నాను. ఈ విధంగా ఎన్నాళ్ళు సరిపెట్టగలను? ఒక రోజు అయితే సుఖా ముఖిగా సినిమాకు రమ్మంటే, నేను తిరస్కరిస్తే వారేమను కుంటారో? నీవు నాకిచ్చిన శిక్షణ, పవిత్ర ఖురాన్ తర్జుమా వల్ల నేను తెలుసుకున్న విషయాల్లో వారికి ఎలాంటి ఆసక్తి లేదు. అల్లాహ్ సర్వం ఇచ్చేవాడని, కోరికలు తీర్చేవాడని విశ్వసిస్తు న్నారేగాని, తహశీల్దారంటే అయన్నే అన్నదాతగా భావించి హడలిపోతారు. అర్ధరాత్రిప్పుడు బంట్రోతు వచ్చి పిలిస్తే వెళ్తారు. కాని ఫజ్ర్ నమాజ్‌కు మేల్కొలిపితే బహుశా కోప్పడతారేమో! వారి విషయాలను ఎన్నని ఏకరువుపెట్టను? ఒక్క మాటలో చెప్పాలంటే అక్బర్ సాహెబ్‌గారిది ఇస్లాం, ఇస్లామేతర విషయాల మిశ్రమం అనడం సబబుగా ఉంటుంది.

నీవు నాకిచ్చిన శిక్షణ, తర్ఫీదుల రీత్యా వారు ఇస్లామ్‌ను అనుసరించేలా చేయడం నా కర్తవ్యం. నేనిప్పుడు ఏం చెయ్యాలో నీవే తెలుపాలి. ఒక వైపేమో వారు నన్ను చాలా ప్రేమిస్తు న్నారు. కాని బొమ్మకు రెండో వైపునే చాలా అంధకారంగా ఉంది. మా పరిస్థితి కూడా సబీహా అక్క, ఆమె భర్తలాగా అవుతుందేమోనని భయంగా ఉంది. నీ సలహా చాలా అవసరం. త్వరలో సలహానిస్తావు కదూ! బావగారికి సలాములు. సల్మాకు ముద్దులు.

ప్రత్యుత్తరం కోసం నిరీక్షించే, నీ

జుహ్రా

# 2

ప్రియమయిన అక్కా !

అస్సలాము అలైకుమ్.

నీ ఉత్తరం అంది ఈపాటికి ఒక వారం అయింది. ఎన్ని సార్లు చదివానో చెప్పలేను వారు ఇంటిలో ఉన్నంత వరకు వారికి కావలసినవి సమకూరుస్తుంటాను. వారు ఆఫీసుకు వెళ్ళ గానే నీ ఉత్తరాన్ని చదువుతాను. నీ వ్రాతలో ఏ మహత్తు ఉందోకాని చదివేకొద్దీ మరీ చదవాలనిపిస్తుంది చదివినప్పుడల్లా ఒక కొత్త విషయం గ్రహిస్తున్నాను నీ ఉత్తరం చూడటానికి చిన్నదిగానే ఉండిగాని సముద్రాన్ని కూజాలో బంధించినట్లుంది సుమా! అక్కా! నీవంటి అక్కను ప్రసాదించినందుకు అల్లాహ్‌కు శతసహస్ర ధన్యవాదాలు. నీ ప్రతి మాట హృదయంలో నాటుకుపోతుంది. ప్రేమ, హితవు సరిపాళ్ళలో ఉన్న నీ ఉత్తరాన్ని ఒంటరిగా చదువుతుంటే, నీవు నా ఎదుట ఉన్నట్లే ఉంటుంది. నీ ఉత్తరం హితోపదేశాన్ని, తృప్తినీ ఇస్తూ ఉంది నీ సలహా పాటించడం వల్ల ఈ వారంలో చాలా మేలే చేకూరింది.

నీ సలహా ప్రకారం వారిని ఏ మాత్రం కదపలేదు. రజియా చాలా చురుకయిన పిల్ల. ఒక్కసారి చెబితే చాలు

గ్రహిస్తుంది. పది రోజుల్లో 15, 16 అక్షరాలు నేర్చుకుంది, ఆరు పదాలను చదువగల్గుతూ ఉంది.

నీ సలహా ప్రకారమే రాత్రి నిద్రపోయేముందు కొన్ని విషయాలు రజియాకు చెప్పుతున్నాను. మహాప్రవక్త (సఅసం) మధుర వాక్కులు, ప్రవక్తల కథలు, సహాబాల చరిత్ర కొద్ది కొద్దిగా అర్థమయ్యే శైలిలో చెప్పుతూవుంటే ఊం, ఊం అంటూ రజియ నా ఒడిలోనే నిద్రపోతుంది. రజియా నాతో ఇప్పుడు మరీ చనువు ఏర్పరచుకుంది. అక్కా ! నీ సలహా పాటించడం వల్ల అక్బర్ సాహెబ్ హృదయంలో నా స్థానం మరీ పదిలమైంది. ఒక రోజు వారు ఏమన్నారనుకున్నావ్ ! "సాధారణంగా అందరి ఇండ్లలో వదిన, ఆడపడుచుల మధ్య జరిగే కీచులాట మన ఇంట్లో కూడ జరుగుతుందనుకున్నా. వ్యవహారం అడ్డం తిరిగి నట్లుంచే" అన్నారు నవ్వుతూ

అక్కా ఏమని చెప్పను నా సంతోషం, "ఇన్షా అల్లాహ్" అనేసి పూనుకున్నాను. దైవ చిత్తమయితే రజియా ద్వారా వారిని సంస్కరించగలననే ధైర్యం నాకిప్పుడు కలిగింది. నీ హితవు ప్రకారం వారి హృదయంలో నా స్థానాన్ని మరీ పదిలం చేసుకోవ డానికి శాయశక్తులా ప్రయత్నిస్తూనే ఉన్నాను. నీ సహాయం ఎంతయినా అవసరం. మధ్యలో వదిలేవు సుమా !

సల్మా ఇపుడు గుం గాం అంటుంది కదూ ! నేను బాగానే ఉన్నానని బావగారికి తెలిపేది

ఇట్లు

నీ

బుషా్ర

# 3

ప్రియమయిన అక్కా !

అస్సలాము అలైకుమ్.

తప్పు ! తప్పు ! లెంపలు వాయించుకుంటున్నానక్కా ! ఇక మీదట నిన్ను బట్రాజులా పొగుడ్తూ ఎప్పుడూ వ్రాయను. క్షమించమని అల్లాహ్‌ను వేడుకుంటున్నాను.

అల్లాహ్ అనుగ్రహం లేనిదే మానవమాత్రులు ఏమీ చేయలేరని, మానవుడు దీక్షతో ప్రయత్నిస్తే ఊహించలేని విధంగా అల్లాహ్ తోడ్పడతాడనే సత్యం నాకీ వారంలో తెలియ వచ్చిందక్కా. మొన్న రాత్రి వారు పడక కుర్చీలో కూర్చుని ఉన్నారు నేను రాత్రి నమాజు చేస్తున్నాను. రజియా నా ప్రక్కనే కూర్చుని ఉంది, కథ వినాలనే కుతూహలంతో. విసిగిందేమో పాపం! నేను "వితరు" నమాజ్ చేస్తూ ఉండగా, వదిన ! త్వరగా పూర్తి చెయ్యి అంది. ష్ ! ష్ ! అంటూ రజియాను వారించారు వారు, నా నమాజ్‌కు భంగం కలుగుతుందేమోనని. నమాజు ముగియగానే, "వదిన ! రాత్రిళ్ళు నమాజు చేయవద్దు" అంది రజియా బుంగ మూతి పెడ్తూ. "ఎందుకమ్మా" అని అడిగాను, 'కథ చెప్పడానికి ఆలస్యం అవు

తుంది' అంది. రజియాను ఆప్యాయంగా ఒడిలోకి తీసుకుని "నమాజ్ చేయకపోతే అల్లాహ్ కోప్పడతాడమ్మా" అన్నారు.

"అల్లాహ్ కోప్పడతాడా? మరి నేను నమాజు చేయలేదే?— నాపై అల్లాహ్ కోప్పడడా వదినా ?" అని ప్రశ్నించింది.

"కోప్పడడు. నీవు ఇంకా చిన్న పిల్లవు కదా ! పెద్దదాన వయినప్పుడు నమాజు చేయకుంటే కోప్పడతాడు" అని సముదాయించాను.

కొద్దిసేపు ఏదో సంశయించింది. వారి వైపు చూస్తూ, "మరి అన్నయ్య ..." అంటూ వాక్యం పూర్తిచెయ్యలేకపోయింది.

కాని ఆ బిడ్డ చెప్పదలచుకున్నది నాకూ, వారికీ అర్థం అయింది. తన తప్పును కప్పిపుచ్చుకోవడానికి వారు అమాంతంగా రజియాను కౌగలించుకున్నారు. తర్వాత రజియా వారి దగ్గర నుండి నా వద్దకు వచ్చి కథకు ఊ కొడ్తూనే నిద్రపోయింది. నేనూ నిద్రపోయాను. ఏదో అలికిడయింది. నిద్రాభంగం అయింది. కన్ను తెరచి చూచాను. ఆ దృశ్యాన్ని నిజమనుకో లేకపోయాను. అఖ్తర్ సాహెబ్ సజ్దాలో "రబ్బనా జలమ్నా అన్ఫుసనా " అంటున్నారు. కన్నీరు కట్టలు తెగి ప్రవహిస్తూ ఉంది. మౌనమే శరణ్యమని క్రీగంట కనిపెట్టూవున్నా. నమాజు ముగించి నా నుదుటి మీద చెయ్యి పెట్టారు. నేను కన్నులు తెరిచి, "క్షేమమేనా ? కన్నీరు కారుస్తున్నారేం ?" అని అడిగాను. సమాధానంగా 'అల్ హమ్దులిల్లాహ్' అంటూ రజియాను ముద్దాడి వారి పడకను చేరారు.

తెల్లవారుజామున నేను లేచినపుడు అలికిడికి వారు మేల్కొ

న్నారు. కాలకృత్యాలు తీర్చుకుని, తువాలు పుచ్చుకుని బయటికి వెళ్ళారు. వారు ఎక్కడికి వెళ్ళేది నాకర్థమయింది. నమాజు చేసేవారు వారిని సంతోషంగా ఆహ్వానించి ఉంటారు. నమాజు చేయనివారు వారిని నిరసించి ఉంటారు. అక్కా, నా ఆనందాన్ని వ్యక్తం చెయ్యడానికి భాషలో పదాలు కరవైనట్లున్నాయి. అల్లాహ్‌కు ధన్యవాదాలు అర్పించాను. అల్లాహ్ అనుగ్రహాన్నే నమ్ముకున్నాను. పరిస్థితి ప్రోత్సాహకరంగానే ఉంది.

ఇన్షా అల్లాహ్, మా గృహం ఒక ఆదర్శ ముస్లిమ్ గృహం కావచ్చు. నమాజు వాస్తవికత తెలిపే పుస్తకాన్ని తప్పక పంపుతావు కదూ.

నమాజు వాస్తవికత తెలియకపోతే వారు కూడా ఇప్పటి యువకుల్లా కొన్నాళ్ళు నమాజు చేసి క్రమేణ వదిలివేయవచ్చు.

అక్కా, పదిహేను రోజులకోసారి నీకు ఉత్తరం వ్రాయాలనుకున్నా. కాని వారు నమాజు చేసిన సంతోషంలో త్వరలోనే వ్రాస్తున్నా. అల్లాహ్ అనుగ్రహం వల్ల మీరంతా క్షేమమే కదా! ప్రత్యుత్తరంలో సల్మా వివరాలు వ్రాసేది బావగారికి నా సలాములు నివేదించు.

నీ సలహాలు అభిలషించే

బుష్రా.

# 4

అక్కా !

అస్సలాము అలైకుమ్ !

"నమాజ్" పుస్తకంతోపాటు, "ఇస్లామ్" పుస్తకం పంపడం వల్ల చాలా మేలే కలిగింది. వారికి ఇస్లామ్‌కు సంబంధించిన విషయాలు తెలుపాలని నీ ఉత్తరం వల్ల బోధపడింది. నా మంచంపై పుస్తకాల కట్ట చూపుతూ, "ఇందులో ఏమున్నాయి" అని వారడిగారు "అక్క పుస్తకాలు పంపింది" అన్నాను. ఆయన కట్ట తీసుకుని విప్పకుండా అటూ ఇటూ చూశారు. "బిస్మిల్లాహ్ విప్పండి, నేను మీదానను, నా వస్తువులు మీవేగా" అన్నాను మందహాసంతో వారి ముఖం ప్రఫుల్లమైంది. కట్ట విప్పి పుస్తకాల పేర్లు చూస్తున్నారు. నేను దగ్గరికి జరిగాను. ఇంతలో రజియా కూడా వచ్చి నిలబడింది. నమాజ్ పుస్తకాన్ని నేను తీసుకున్నాను ! "వదినా ! నాకో పుస్తకం" అంటూ రజియా అడిగింది 'నీకు చదవడము వచ్చా?' అంటూ ఇస్లామ్ పుస్తకాన్ని రజియాకు ఇచ్చాను ఇంక వారికి మిగిలింది 'ఈమాన్' పుస్తకమే. వారు ఈమాన్ పుస్తకాన్ని ప్రథమంలో చదువుతారని ఈ విధంగా చేశాను నా చేతికి అందిన పుస్తకాన్ని విప్పి ఎక్కడో

ఒక పేజీ తీసి చదువుతున్నా. రజియా పేజీలు త్రిప్పుతూ ఉలిక్కిపడి, "వదినా, వదినా! ఇక్కడ అల్లాహ్ అని వ్రాసి ఉంది చూడు" అని చూపింది.

వారు ఈమాన్ పుస్తకం చదువుతూ మంచం మీద కూర్చున్నారు. ఇంకా అక్కడ నిలబడటం సరికాదని నేను నా పనుల్లో నిమగ్నమయినాను. వారిని అప్పుడప్పుడు గమనిస్తూనే ఉన్నాను. పుస్తకంలో లీనమయిపోయారు. నవలలు, కథలు, కథకాని కథలు చదివేవారు ఈ పుస్తకాల్లో ఆసక్తి కనబరచలేరేమో? అన్న నా సందేహం పటాపంచలయింది. ఆ పుస్తకాన్ని ముగించి మరీ లేచారు

"చాలా ఘాటుగా ఉందీ పుస్తకం. ఎప్పుడూ నమాజ్! నమాజ్! అంటూ 'ముల్లానీ'గా తయారయ్యావు. మొదట ఈ పుస్తకాన్ని చదివి నిజమయిన ముస్లిమ్ అవ్వాలి. తర్వాత ఇతర విషయాలు" అన్నారు.

'నేనీ పుస్తకం చదవలేదనుకున్నారీ మహానుభావులు!' అని మనసులో అనుకుని, వారి ఆజ్ఞ శిరసావహిస్తున్నాననే భావం కలిగేటట్లు నా చేతిలో ఉన్న ఇస్లామ్ పుస్తకం వారి చేతికి అందించి, వారి చేతిలో ఉన్న "ఈమాన్" పుస్తకాన్ని అందుకున్నా. ఇస్లామ్ పుస్తకాన్ని పుచ్చుకుంటూ, "ముల్లానీజీ! వాస్తవం ఆ చిన్న పుస్తకం చదివితే అర్థమయింది" అన్నారు.

అక్క సూచనలు బాగుగానే ఉన్నాయి. ఆ రోజు పుస్తకం చదువుతూ ఇంట్లోనే ఉండిపోయారు. సాయంత్రం వారి స్నేహితులు ముజఫ్ఫరు సినిమాకు రమ్మని ఆహ్వానించినా ఏదో

సాకు చెప్పి ఇంటిలోనే ఉండిపోయాడు. నన్నే సినిమాకు రమ్మంటారేమోనని భయపడేదాన్ని. కాని ఈ రోజు వారే సినిమాకు వెళ్ళకుండా ఇంట్లోనే ఉండిపోయాడు. ఇదంతా ఆ పుస్తకం మహిమ. మానవుడు అల్లాహ్ వైపుకు అంగుళం జరిగితే అల్లాహ్ మానవుని వైపు కొన్ని గజాలు ముందుకు వస్తాడనేదానికి మావారే సరయిన ఉదాహరణ.

రజియా రెండక్షరాల పదాలు చదువుతుంది. రజియా ఖాలిదాతో ఆడుకుంటూవుంది, ఖాలిదా బాగా చదువుకున్న అమ్మాయి. ఒక రోజు ఆ అమ్మాయి నమాజ్ చేయడం రజియా చూచింది.

ఇంటికి వచ్చి. 'వదిన! నాకూ నమాజ్ నేర్పు. నాకంటే ఖాలిదా రెండు వేళ్ళే ఎత్తు. అది నమాజు చేస్తుంది. నేనూ చేస్తాను. నమాజ్ చేయకుంటే అల్లాహ్ కోప్పడతాడని నీవేగా చెప్పింది' అని పట్టుపట్టింది.

చూడక్కా, రజియా జ్ఞాపక శక్తి! వారి కోసం ఇంకా కొన్ని పుస్తకాలు పంపించు. "మీ అక్కకు నా సలాములు వ్రాయి.' ఒకసారి రమ్మని ఆహ్వానించు" అన్నారు.

అక్కా! వారు మన వైపు మొగ్గినట్లు విశదమవుతుంది కదూ! త్వరలో నిన్నూ, బావగారిని ఆహ్వానించదలిచాను. బావగారికి సలాములు అందజెయ్యి.

నీ ఆశీస్సులు కాంక్షించే,

బుష్రా.

# 5

అక్కా !

నీకు వేనవేలు సలాములు, ధన్యవాదాలు. ఏం చక్కని ఉపాయాన్ని చూపెట్టావు! ఛీ! పొరపాటు, మళ్ళీ నిన్ను పొగడడం మొదలెట్టాను అక్కయ్యా! ఎప్పుడయినా నాకు తెలీకుండ ఇలాటి వాక్యం రాశానంటే క్షమించవూ? ఈమారు నీవు చూపెట్టిన "మౌన ప్రచార" విధానం నూటికి నూరు పాళ్ళు ఫలితాన్ని ఇచ్చింది

నీవు చెప్పినట్టే వారిని ఒకసారి అడిగాను అక్కయ్య పంపిన పుస్తకాలయితే చదువుకుంటున్నా, కాని మీరు రోజూ పది నిమిషాలు వాటిని విశదీకరించారంటే మనస్సులో నాటుకు పోతాయి అప్పుడు నేను మీరన్నట్లు నిజమయిన ముస్లిమవు తాను, అనడిగాను నా కోరికను వారట్టే ఒప్పుకున్నారు నాకు పాఠం చెప్పటం మొదలుపెట్టారు ముందు తానే చదివి సిద్ధమవుతారు ఎన్నో దినాల విశదీకరణ కృషి వల్ల ఇప్పుడు నాటు నీవు ఎప్పుడూ చెప్పే వాక్యాన్నే పలుకుతుంటారు.

'ఈమాన్' (విశ్వాసం) విధించే బాధ్యత ప్రకారం, ప్రైవ సంస్కరణ అన్నది ఒక్క నమాజులో మాత్రమే చేసేది కాదు.

ప్రతి జీవన రంగంలోనూ ఆయన ఆజ్ఞలను శిరసావహించాలి” అని అంటుంటారు. ఎక్కడయినా విశదీకరణ వ్యాఖ్యానంలో లోటు ఉండిపోతే, అప్పుడే ప్రశ్నిస్తాను నా 'బుద్ధికుశలతను' మెచ్చుకుంటూ మళ్ళీ వివరంగా చెబుతారు. ఇది చాలా నెమ్మదయినదీ, ప్రభావం కలిగే విధానం ఒక వైపు నా విజ్ఞానంలో నూతనత్వం వస్తుంది మరొక వైపు నాది హృదయంలో దేవుని ఏకత్వమూ, దానిచే విధింపబడే బాధ్యతలున్నూ నాటుకపోతున్నాయి. ఒక రోజు భలే తమాషా జరిగింది 'మనోకాంక్షలను లొంగదీసినంతవరకు, ప్రతి జీవన రంగంలోనూ దైవాజ్ఞలను పాటించడం దుర్లభం' అని వారన్నదానికి— “అన్నయ్యా! ఈ 'ఖాంఛా' ఏమిటీ ?” అనడిగింది రజియా! రజియా 'ఖాంఛా'పై మేమిద్దరం బాగా నవ్వుకున్నాం. “చిట్టీ! ఖాంఛా కాదమ్మా! కాంక్ష! కాంక్ష అంటే తనకు నచ్చినదాన్ని చేయడం” అంటూ వారు నన్ను పరిశీలించారు. రజియా అండగా నాకు బోధించారు కాబోలు! దాని ప్రభావం నా మీద ఎలా పడిందో గమనించారు. బావుంది, ఒక కాలంలో వారిని నేవెంటాడాను. ఇప్పుడు-ఇప్పుడు ప్రతి జీవన రంగంలోనూ— దైవ నియమాలను పాటించాలని వారి ఆశ! లోలోపల అల్లాహ్‌కు దన్యవాదా లర్పించుకున్నాను.

నీవు పంపిన మూడు పుస్తకాలు వ్యాఖ్యానంతో సహా వివరంగా చదివించారు. ఇంకా కొన్ని పుస్తకాలుంటే ఇస్లామ్ గురించి మనస్సులో ఉన్న అనుమానాలన్నీ దూరమవుతాయి. మనస్సు ఎంతో శుద్ధమయ్యేది ? అంటారు 'మీ అనుమానాలేవిటి ?”

అడిగాను. 'నీవు స్త్రీ జాతివి. విని, మనోకలవరంలో పడ్డావంటే, ఆ పాపం నన్ను చుట్టుకుంటుంది' అని జవాబిచ్చారు.

అక్కా, ఇక నీవూహించు, 'వారు దేన్ని వెతుకుతున్నారో, వారిలో ఎంత జాగ్రత్త వచ్చేసిందో !'

ఇవన్నీ సరే ! ఇంకా వారి ప్రవర్తనలో ఇస్లామ్ కోరే పరివర్తన రాలేదు. హుషారుగా ఉన్నారంటే ఏదో ఒక అబద్ధమాడేస్తారు. 'శ్రమ ఫలితం' ఇంకను అయిదు–పది రూపాయల రూపేణ వస్తూనేవుంది. ఎంతలేదన్నా ఆదివారం సినిమాకు వెళ్తూనే ఉంటారు. అన్నిటికంటే ఆందోళనకరమైన విషయం ఏమిటంటే, నమ్మకాల సంబంధంగా వారు ఇప్పుడు ముస్లిమ్‌ల పైనే దాడి చేస్తున్నారు, వారిలో ఈ విషయం చాలా తీవ్రంగా ప్రవేశమవుతుంది. ముందిది ఇంచుకయినా ఉండేది కాదు. ముందు ఈమాన్ (విశ్వాసం), ఇస్లామ్ విధించే బాధ్యతల జ్ఞానం బహుశ లేకపోవటంవల్లనేమో ! కాని నా సలహా ఏమిటంటే, వీరు లంచం విడిచిపెట్టడానికి, రోజురోజుకు మీరి పోతున్న నోటిని అధీనంలో ఉంచుకోవడానికి, హలాల్-హరామ్ (ధర్మా-ధర్మాల్లో) తేడా చూపించే పుస్తకం ఏదయినా కావాలి. వేరేదంతా అల్లాహ్ కృప ! వాదోపవాదాల్లో పడటం నాకిష్టం కాదు. వాదనల్లో ఇట్టే గెల్వడం-ఓడడం అనే భావనలుద్భవిస్తాయి. మన కోరిక ఫలించదు. పుస్తకం మాట వేరు. అది ఒక మౌన ప్రచారం. దాన్ని ఎంత ఎదిరించినా—ఏకీభవించినా మారు పలుకదు. చదివి సంతోషించినా సరే ! శైలి నచ్చక విసుగుజెందినా సరే అది మాత్రం మౌనంగానే ఉంటుంది.

మరి రచనలో జీవం ఉండింపంటే తన కార్యం సక్రమంగా ముగిస్తుంది.

లంచాన్ని సహేతుకంగా ఖండించే పుస్తకాన్ని ఒకటి, మన ప్రియ ప్రవక్త (సఅసం) ఏ విధంగా ఓర్పు, నిదానం, మరి నిలకడతో ఇతరులకు ఇస్లామ్ సందేశాన్ని అందజేసేవారో— ఆ వివరాలు గల పుస్తకం ఒకటి పంపిస్తే బావుంటుందని నా సలహా. ఇది సలహా మాత్రమే! నీవే తగిన పుస్తకాలు పంపించు. ఎంతయినా నా నిర్ణయం కంటే నీ నిర్ణయమే సరయినది.

'సల్మా'కు పళ్లు వస్తున్నాయని వ్రాశావు. అల్లాహ్ ఆ పసిబిడ్డను తన రక్షణలో ఉంచుగాక!

నీ కోరిక ప్రకారం స్వచ్ఛమయిన తేనె పంపుతున్నాను. సల్మా ఆరోగ్యం గురించి త్వరగా వ్రాయి! మనస్సంతా అటే ఉంది.

వస్సలామ్

నీ

బుషా్ర.

# 6

కరుణామయీ అక్కా!

అస్సలాము అలైకుమ్.

ఈమారు నీ ఉత్తరం వారే తెచ్చి ఇచ్చారు ఉత్తరమూ, పుస్తకాల కట్ట తీసుకుని హడావిడిగా కేకేసుకుంటూ వచ్చారు. 'ఏమండోయ్ ఎక్కడ? ఇదో మీ అక్కగారు వ్రాసిన ఉత్తరం ఉత్తరం మీకూ, పుస్తకాలు నాకున్నూ' అప్పుడు రజియాకు పాఠం చెబుతున్నా. నా దగ్గరకు వచ్చి పీటపై కూర్చున్నారు ఉత్తరం నాకిచ్చేశారు. కట్ట విప్పడంలో నేను సహాయపడ్డాను ఎంత ఆత్రం! చుటుక్కు చుటుక్కున కట్ట తెంపేశారు. పుస్తకం తెరిస్తే— ఇంగ్లీషు నా వైపు చూసి నవ్వేశారు! అర్థమయిందా అని అడిగారు. నాకేమర్థమవుతుందని! పేరేమిటని అడిగితే, ఏదో రుసుబుస లాంటి పేరు చెప్పారు. 'ఏ విషయం గురించి?' అని అడిగాను. 'ఆఖిరత్ (పరలోకం) గురించి' అన్నారు. వారు దాని పీఠికా— నేను నీ ఉత్తరం చూడటం మొదట్టాను. బహుశా పొగడకుండ ఉండజాలవని నీవంటావు. మరి నేనేం చేయను, నోటి నుండి "శెభాషు" తానంతట తానే వచ్చేస్తేను. వాస్తవంగా వారికి ఆఖిరత్ (పరలోకం) గురించే

పుస్తకమవసరం. నీ ఎన్నికే సరయినది. వారి ద్వారా దాని తర్జుమా వినాలని ఉంది. చాలా బాగుంటుందని నా నమ్మకం. ఆంగ్ల రచయితలు బాగా పరిశోధించనిదే నిరాధారంగా ఏదీ ఒప్పుకోరన్న బావగారి అభిప్రాయం జ్ఞాపకం వస్తుంది. ఏ ఆంగ్ల రచయిత కూడా ఇలా వ్రాయజాలడని ఈ పుస్తకం గురించి ఆయనగారి అభిప్రాయం.

పుస్తకం లావుగా ఉంది కాబట్టి చదవడానికి పది-ఇరవై రోజులు పట్టాయి. ఇంతవరకున్నూ— వారు నాతో ఏమీ చెప్ప లేదు. పది గంటల రాత్రి వరకు చాలా సీరియస్‌గా చదువు తుంటారు. ఏవో నోట్ కూడా వ్రాస్తూ ఉంటారు. ఎప్పుడైనా అడిగితే, 'ముందు నన్ను ముగించనీ' అనేస్తారు. ఒకమారు— 'మీ అక్కగారు ఇంగ్లీషు కూడా చదివారా?' అని అడిగారు. నేను, 'ఒక్క అక్షరమూ రాదు. బహుశ బావగారు తెప్పించి ఉంటారు. అక్కయ్య మీకు పంపి ఉంటుంది' అన్నాను. వారిపై దీని ప్రభావం మహా గొప్పగా అయింది. అన్నారు కదా. ఎంత మంచివాళ్ళు మీ వాళ్ళంతా. అల్లాహ్ వారికి గొప్ప పుణ్యం చేకూర్చుగాక! ఈ పుస్తకం చదవటం వల్ల నా మనసులో ఉన్న సంకోచాలన్నీ పటాపంచలయ్యాయి. పరలోకం ఒట్టి కల్పితం అనేవాడిని. కాదు, అది యదార్థం! దీని తర్జుమా ఉర్దూ-హిందీ మరి ఇతర భాషల్లో చేస్తే ఎంత బావుంటుంది. సామాన్య ప్రజలు కూడ దీనివల్ల ప్రియ ప్రవక్త (సఅసం) బోధించినది ఎంత గొప్ప యదార్థమో తెలుసుకోగలరు! వారి నోట ఈ ఉపన్యాసం విని ఉబ్బితబ్బిబ్బు అయ్యాను. ముఖ్యంగా వారు 'వాస్తవంగా మన దగ్గరున్నదంతా దేవుని

అమానతు. ఒక రోజు దీనంతటికీ లెక్క చూపాలి.' అన్నప్పుడు— 'లెక్క ఏమిటి ?' అనడిగాను.

ఈ దైవ ప్రసాదితమైన నోరు, కాళ్ళు, చేతులు, ముక్కు, చెవి, హృదయము, జ్ఞానము మరియు ఈ ఇల్లు-వాకిలి మొత్తం ప్రభువొసంగిన సామగ్రి— వాస్తవంగా మనది కాదు, పుట్టించిన వానిదే కొన్ని దినాల కోసం మనకు అమానతుగా అప్పగించ బడింది.

చూడు— చాలా గొప్ప పరీక్షలో మనమంతా ఇరుక్కొని ఉన్నాం. "ఎవరెంత పెద్ద స్థానం కలవారో వారికన్ని కష్టాలు ఎక్కువ! మానవునికివ్వబడిన స్వల్ప అధికారం అర్థరహితం కాదు— పశువుల్లా కాదు— పుట్టి, తిని, తాగి, చావడానికి— పరీక్షా శోధనలూ లేకుండా ఉండటానికి!"

అక్కా, ఈ పుస్తకం వారిపై ఎంత ప్రభావం వేసిందంటే, ఒక రోజు రాత్రి సుమారు పదకొండు గంటలకు మెలకువ వచ్చి చూస్తే— వారు చేతుల్లో తల ఆనిచ్చి, 'నేనొక గడ్డిపోచనయి ఉంటే ఎంత బాగుండేది గడ్డిపోచలాగే జీవితం ముగించేవాడిని. పరలోక బాధ్యత తప్పించుకునేవాడిని కదా !' అంటున్నారు.

ఆ రాత్రి నా నిద్ర కూడ మాయమయింది. వారూ రాత్రంతా అశాంతిగా గడిపారు మాటిమాటికి ఉలిక్కిపడేవారు. తెల్లారి నాతో— బుషా ! (ఇదే తొలిసారి వారి నోట నా పేరు వినడం, ఏదో అతి ముఖ్య విషయమేనని తలంచాను. 'వెయ్యి చెవులుగా' విన్నాను) "బుషా ! ఇప్పుడెలా ?" అనడిగారు.

"క్షేమమేగదా ? ఈ వేళ చాలా అశాంతిగా ఉన్నారు ?"

అని అడిగినదానికి, "నాకు తెలిసినదంతా నీవెరిగితే వెక్కి వెక్కి ఏడ్చేదానివి ?" అన్నారు.

'అసలు సంగతేమిటో చెప్పండే ?' మళ్ళీ అడిగాను.

"ఏదని చెప్పమంటావు ? అబ్బ ! దేవుడిచ్చినదాన్నంతా ఎన్నో విధాలుగా ఆయన ఇచ్ఛకు విరుద్ధంగా ఉపయోగించానే బుహ్రా ! ఈ చేతుల్ని చెడు పద్ధతుల్లో ఉపయోగించాను. ఈ కాళ్ళతో దేవుడు నిషేధించిన మార్గాన వెళ్ళాను. ఈ నాలుకను దైవభీతిలేక స్వేచ్ఛగా వాడాను. మనస్సులో తలంపులన్నీ దైవ వ్యతిరేకమయినవే ! చేసినదంతా మనోకాంక్షల కొరకే !! అయ్యో! ఇప్పుడెలా ?"

వారి కన్నుల నుండి అశ్రువులు ఒలకసాగాయి ఇద్దరం చాలా కాలం నిశ్శబ్దంగా ఉండిపోయాం. పాపం పసిబిడ్డ రజియా వారి వైపు, నా వైపు తిరిగి తిరిగి చూసేది.

ఉండబట్టలేకపోయింది 'వదిన ! ఏం అన్నయ్య ఏడుస్తు న్నాడు ?' అనడిగేసింది. ఏదో చెబుతాననుకునేలోగా వారు చేయి చాచి దాన్ని ఒడిలో తీసుకుని కౌగిలించుకుంటూ— "అమ్మా, దేవుడు నా మీద చాలా ఆగ్రహిస్తాడు" అన్నారు. తన అన్న నోట ఇది వినగానే రజియా హుషారుగా— 'అంత మాత్రాన ఏడవటం దేనికి, క్షమాపణ కోరుకోండి. దేవుడు చాలా మంచివాడు, ఆయన దగ్గర క్షమాపణ కోరుకుంటే క్షమిస్తా తని వదిన నాతో అంది' అన్నది.

రజియాతో తరచుగా నే చెబుతుండే మాటలివి. ఇది విని వారికాస్తా నెమ్మది కలిగింది. నా వైపు చూచారు.

క్రిందికి చూస్తూ—"లా తక్నతూమి'ర్‌హమతిల్లాహ్" (దేవుని కరుణ పట్ల నిరాశ చెందకు) అన్నాను. "వాస్తవమే" అన్నారు. తరువాత ఏమయిందీ ? మరో ఉత్తరం వ్రాస్తాను. నీవు, బావ గారు మా సలాహులు స్వీకరించండి.

సల్మాకు పళ్లు వస్తున్నాయి కదూ. దాని క్షేమం తెలుపుతూ ఉండు.

వస్సలామ్

నీ క్షేమాభిలాషి
బుషా్ర

# 7

అక్కయ్యా !

అస్సలాము అలైకుమ్.

మొన్న శుక్రవారంనాడు వారు ఆఫీసుకెళ్ళలేదు. అడిగితే—ఈవేళ సెలవు తీసుకున్నా. నీతో ఒక విషయం మాట్లాడాలి అన్నారు. "శెలవియ్యండి. నాకిప్పుడు తీరికే" అన్నాను. "రెండు సంవత్సరాల కరువు భత్యం అని రు. 150లు నీకిచ్చా. జ్ఞాపకముందా అదంతా శుద్ధ అబద్ధం. జమీందారీ రద్దయినపుడు, జమిందారు వద్ద రు. 150లు లంచం తీసుకుని

ఒక కేసును తారుమారుచేసి తహసీల్దారు సంతకం చేయించా. ఆ డబ్బే నీకిచ్చింది. తహసీల్దారునయితే మోసగించా, కాని సర్వత్రా, సర్వ వేళలందుండె దేవుని మోసగించగలనా! అధిక శ్రమ ఫలితమంటూ నీకిచ్చినదంతా లంచమే సుమా! అధర్మ సంపాదనను నీకు కుడువబెట్టి, నేను పాపినైనది చాలక నిన్ను కూడ ఈ ఊబిలోకి ఈడ్చా. ఈ పాపానికి ఏదయినా విముక్తి ఉందా? అదంతా అలాగే ఉంచి ఉంటే ఎంత బాగుండేది. క్షమాపణ చెప్పుకుని దాన్నంతా వారికి వాపసు చేసేవాణ్ణి. ఇంకో విషయం— అధర్మమయిన ఒక పైసా కూడా ముట్టకూడదని నిశ్చయించుకున్నా— నీవేమో కలో గంజో త్రాగి ముతకో సతకో కట్టుకుని ఈ రు. 80లు లోనే సర్దుకోవాలి. లేకుంటే ముందే చెప్పెయ్యి— గారాబంగా పెరిగినదానివి. ఆదాయం కొరత వల్ల కోరికలు తీరకపోతే రోజూ పోట్లాడేవు సుమా!" అని అంటూ పెద్దగా ఉపన్యాసమిచ్చారు. అక్కా! నా ఆనందానికి అవధుల్లేవు. "ఈ విషయంలో మీతో జీవితమంతా సహకరిస్తా. దైవానుగ్రహమయితే ఈ రు. 80లే మనకు సరిపోవచ్చు. దైవ సమ్మతి, పరలోక శ్రేయమే గా నేను కోరేది" అన్నాను.

అక్కా! నా ఈ సమాధానం వారిని మంత్రముగ్ధులుగా జేసింది. చేతులు ఎత్తి లోలోపల నా గురించే అనుకుంటూ దేవుని ప్రార్థించారు.

'ముస్లిమ్ స్త్రీ అంటే అచ్చం నీలాగే ఉండాలి' అన్నారు. "ముస్లిమ్ పురుషులు అచ్చం మీలాగే ఉండాలి" అన్నాను. లోపలికెళ్ళి అధిక శ్రమ ఫలితం దాచిన మందసాన్ని తెచ్చా. 'ఇదేమిటి?' అడిగారు ఆశ్చర్యంగా. "ఈ దినం కోసమే వీటిని

దాచిపెట్టా. ఇందులో ఒక్క పైసా కూడ నా కోసంగాని, ఆహార సామగ్రి కోసంగాని వినియోగించలేదు"అన్నాను. "ఆ, నిజమా !" అంటూ విస్తుబొయ్యారు 'బుష్రా! ఎంత అసాధ్యురాలివి! గొప్పవారు సయితం సాదించలేని కార్యాన్ని సాధించావు. ఏది అంటూ నా నుదుటిని. . ఇక చాల్లెద్దురు మీరూ, మీ పొగడ్తలు' అన్నాను

పెట్టె తెరిచారు. వెయ్యి పైచిలుకు డబ్బుంది. ఎవరి వద్ద నుండి ఎంత తీసుకున్నది వారికి వాపసు చేయాలనీ, జ్ఞాపకంలేని పద్దుల్ని దైవసమ్మతికై దాపరికంగా, పేరుప్రఖ్యాతుల కోసం కాకుండా బీదలలో పంచాలనీ నిశ్చయించుకున్నాం. నోట్లన్ని జేబులో నింపుకొని బయలుదేరారు. తిరిగివచ్చాక వారి ముఖం కళకళలాడుతూ ఉంది. ఇది వారిలో వచ్చిన తొలి విప్లవం. ఐదు, ఆరు మాసాల కష్టఫలితమిది. వారికి జ్ఞానోదయాన్ని ప్రసాదించిన దేవుడికి సహస్ర కోటి ధన్యవాదాలు.

ఈ విషయం బావగారికి విన్నవించేది వారు కూడా సంతోషపడతారు. సల్మాకు ముద్దులు.

వస్సలామ్.

నీ శిక్షణ పొందిన,

బుష్రా

# 8

అక్కయ్యా!

మా ఇద్దరి సలాములు స్వీకరించు. బావగారికి కూడా నివేదించు. నీవు నాకు వ్రాసిన ఉత్తరంలోను, వారికి వ్రాసిన ఉత్తరంలోను ఒకే విషయం ఉంది. లంచాన్ని విడిచిపెట్టి నందుకుగాను బావగారు అభినందించినందుకు చాలా సంతోష పడ్డారు. పదే పదే ఉత్తరాన్ని చదువుకున్నారు. జవాబు కూడా వ్రాసివుండవచ్చు అది ఆవేశపూరితమై ఉండవచ్చు బావ గారిని అడిగి తెలుసుకో. అల్లాహ్ వారికి సన్మార్గంపై స్థిరపడేలా శక్తిని ప్రసాదించుగాక

ఆవేశమేమంత మంచిదికాదని నీవు వ్రాశావు. నాకు కూడ చింతగా ఉంది. ఏదయినా మధ్యస్థంగా ఉంటేనే శ్రేయస్కరం. అయినా ఇప్పట్లోనే ఆ విషయం ప్రస్తావించదలచ లేదు. ఆవేశం చాలా కాలం మనజాలదు కూడా. ఈసారి నీవు ఉత్తరంలో కనబరచిన గృహస్థు సంబంధమయిన సలహాలు నీ శిక్షణను స్పృహకు తెచ్చాయి. అల్‌హమ్దు లిల్లాహ్, వాటినే పాటిస్తున్నాను.

మిగతా ఉద్యోగులందరూ ఊడికిపోతారని నీవన్నది వాస్తవమే. వారి ఉమ్మడి 'వ్యాపారానికి' ఇది అంతరాయమే. మరి నిజాయితీపరుని హుందా, ఠీవి వేరుగానే ఉంటాయి. ఆఫీసరు వారిని చూసి అసూయపడుతున్నాడట. వీరు లంచం తీసుకోనందున ఇతరుల రాబడికి ఘాటయిన దెబ్బ తగలవచ్చు. అప్పుడు అందరూ వారికి వ్యతిరేకులు కావచ్చు. "వీళ్ళందరితో ఎలా వేగాలో?" అన్నారు చిరాకుగా ఒక రోజు.

ప్రభూ! అన్నదాత! అనేవి ఉద్యోగుల సాధారణ ఊత పదాలు. మిట్ట మధ్యాహ్నం "అడుగో చంద్రుడు" అని ఆఫీసరు అంటే నక్షత్రాలు లెక్కపెడతారు క్రింది ఉద్యోగులు! నా అభిప్రాయంలో ఈ ఉద్యోగం ఏమంతా మంచిది కాదు. ప్రతి శాఖలోనూ లంచం, ముఖస్తుతులు, దగా, దోపిడి, ఒత్తుడులున్నాయి. అధికారులా? అధికారులు దైవ భీతి కలవారు కారు. దైవభీతి అలా ఉంచి, ప్రతి ఒక్కరు తామే దేవుళ్ళయి తమ క్రిందనున్నవారిపై దైవత్వం చలాయిస్తున్నారు, ఇక వారు ఈ వాతావరణాన్ని ఒక్క క్షణం కూడ సహించలేరు. కాని ఈ విషయాన్ని స్వయంగా వారే గ్రహించాలి. ఇన్షా అల్లాహ్, స్వయంగా వారే గ్రహిస్తారు కూడా.

మొన్న తహసీల్దారుతో రగడ పెట్టుకున్నారట 'ఎందుకు?' అని అడిగాను, శుక్రవారపు నమాజు వేళ సమీపిస్తూ ఉంది. తహసీల్దారు కేసు విచారణ చేస్తూనే ఉన్నాడు. ఇక సమయం పూర్తిగా సమీపించినపుడు చెప్పకుండా లేచి పోయారట. తహసీల్దారుకు చాలా చిరాకు కల్గిందట కేసు విచారణ ఆపాడట. చేయగలిగిందల్లా చేసి ఏవో నేరాలు మోపి ఉద్యోగం నుండి తీసి

వేస్తారు లేదా రాజీనామా ఇవ్వమని ప్రోద్బలం చేస్తారు.. అదీ మన మేలునకే. ఈ దాస్య సంకెళ్ళు వదులుతాయి. అందరినీ పోషించేవాడు అల్లాహ్, ఒక ద్వారం మూయబడితే. మరొక ద్వారం తెరుస్తాడు. ఇదే నా విశ్వాసం.

ఉద్యోగం విడిచిన తరువాత ఏ వృత్తి అవలంబిస్తే బాగుం టుందో ఇపుడే సలహా ఇస్తావని ఆశిస్తున్నాను. బావగారిని కూడ అడిగి చూడు.

ఇస్లామీ పత్రిక ఒకదానిని ప్రారంభించాలని బావగారను కునేవారు వారి అభిప్రాయంతో ఏకీభవించే, సహాకరించే వ్యక్తి దొరకనందున ఏమీ చేయలేకపోతున్నానని వాపోయేవారు. కాయ-కష్టమూ వీరు చేయలేరు వేరే వృత్తి విద్య వీరికి లేదు. కలం-కాగితం పనే వీరు చేయగలిగినది. ఆపై దైవేచ్ఛ నీ ప్రార్థనలలో నన్ను మరచిపోకు ఈ ఉత్తరం బావగారికి కూడా చూపించు.

సల్మాకు ముద్దులు

నీ చెల్లి
బుష్రా.

# 9

అక్కయ్యా !

మా సలాములు స్వీకరించు. మా కొరకు హృదయపూర్వకంగా ప్రార్థించు. పరీక్షా ఘడియలు వచ్చాయి. ఆదివారం నాడు వారు, వారి మామగారు కలిసి ఇంటికి వచ్చారు. వైఖరి చూస్తే ఏదో పొసగనట్లు స్పష్టమవుతూనే ఉంది ఏ అవాంతరం వాటిల్లిందో దేవునికే ఎరుక ! అని భయపడ్డాను.

మునుపు ఎప్పుడొచ్చినా ఇద్దరు హాయిగా సరదాగా మాట్లాడుకునేవారు. ఏమి చెప్తారో అనుకుంటూనే ఇద్దరికీ కుర్చీలు వేసి టీ చేయడం మొదలెట్టాను. ఇద్దరూ ఆలోచిస్తూనే ఉన్నారు. మామగారు మాత్రం తెచ్చిన అరటి పండ్లు, ఆపిల్ పండ్లు రజియాకి ఇచ్చారు. ఒడిలో కూర్చోబెట్టుకున్నారు. రెండు, మూడుసార్లు రజియా పలకరించింది. కాని మామగారు ముభావంగానే ఉన్నారు. విసిగి కాసేపటికి రజియా నా దగ్గరకు వచ్చేసింది

కప్పులో టీ పోస్తుంటే "నాకు వద్దమ్మాయ్" అన్నారు మామగారు నే తెల్లబోయాను. "ఎప్పుడూ లేనిది ఇద్దరూ

అలా మౌనంగా ఉన్నారేం ?" అని ధైర్యంగా అడిగాను. సమయానికై ఎదురుచూస్తున్నట్లుంది. "ఏంవమ్మా ! దేనికి మాట్లాడం; అలా చూడు బాబుగారిని. అమ్మ, నాన్న పోతే, పెంచి, పెద్ద జేసి, చదివించి, అన్ని ఖర్చులు భరించి కంటి రెప్పలా కాపాడాను. చెల్లెలి గుర్తు కదా అని గుండెల్లో దాచి పెంచాను. ఉద్యోగం ఇప్పించి, పెళ్ళి-పెటాకులు జరిపించాక బాబుగారు యోగ్యులయ్యారు చూడు, ఆ వాలకం, ముఖం చిట్లించి కూర్చున్నారు. ఇప్పుడీయనగారి వద్ద నా కేసుంది. ఒకసారి దాన్ని అలా జేసెయ్యమంటే—ఇదంతా మోసం, అన్యాయం అంటారు బాబుగారు. నిన్నటి వరకు ఎన్ని అబద్ధాలు పలికారో! కాని ఇపుడు మేనమామ తల నరికి మహా సత్యవంతులు కాబోతున్నారు. అయ్యో ! ఏం కాలం వచ్చింది !" అంటూ మతిడిపడ్డారు. "అమ్మాయ్, నీవు తెలివిగలదానివి, నీవయినా చెప్పు వాడికి. నేను చెబితే కాదంటే కాదన్నాడు. మౌనంగా ఉండకుంటే ఏం చేయమంటావ్. పిల్లప్పుడు కూడ వీణ్ణి పల్లెత్తు మాట అనలేదు. పెద్దవాడై నాతో ఈ విధంగా ప్రవర్తించాడని తెలిస్తే లోకం వాణ్ణి అతి నీచంగా చూస్తుంది, ఊస్తుంది కూడా."
'అసలు విషయం ఏమిటి ?' అన్నాను మధ్యలో—

"ఏముంది, పంచదార బస్తాలు అక్రమంగా వేరే జిల్లాకు తీసుకునిపోతూ పట్టుబడ్డారు. ఆ చార్జిషీటునే మాయం చేయమంటున్నారు. రెండు కాసుల నష్టం భరించలేరు. కాని నా చేత అక్రమ కార్యం చేయించింది కాకుండా తహశీల్దారు వారికి లంచం నా ద్వారానే ముట్టజెప్పాలని కోరుతున్నారు . . ఇహంలో ఎట్లో ఒకట్లా కార్యం సాధించుకోవచ్చు. కాని పరలోకంలో

దేవుని ఎదుట ఏం సమాధానమివ్వాలి? అంతే—దానికే ఈ ఆగ్రహావేశమంతా. నీతిమార్గ మవలంబించినందుకు పెద్దలు సంతోషించి ప్రోత్సహించాలికాని, ఈ దూషణ, అపవాదు లేమిటి?" అని ఆవేదనతో అన్నారు వారు. ఇవీ పరిస్థితులు. మామగారేమో పాత కాలం మనిషి—వారినేమనేది? పరలోక భీతితో పిరికి మతిహీనులయిపోయారు ఒక విషయాన్ని ఎదుటి వారికి నచ్చచెప్పే విధానం కూడా ఉంది. కాని ఈ విధంగా ఫిరంగి గుండ్లు వదిలితే ఏమవుతుంది? అది నుండి నాకు భయం గానే ఉంది.

అది కాస్తా ఇప్పుడు నిజమయింది. ఆ రోజు ఎలాగో సరి పుచ్చాను కాని, ఈ రోజు తాతగారు కూడా చెప్పి పంపారు. వీరిక్కడ తమ పట్టును వదలనంటున్నారు. వీరనేది వాస్తవమే కాని, వైఖరి మాత్రం అపాయకరంగా ఉంది. పరలోక భీతి అంటే జగడం కొనితెచ్చుకోవడం కాదుగదా? చెప్పేదేదో నెమ్మదిగా మంచిగా చెప్తే పొయ్యేది. ఇపుడిలా పరిణమించింది. ఎలా సర్దుకోవడం? వచ్చే వారం కేసు వాయిదా. కేసు తనకు అనువుగా మారకపోతే శాశ్వతంగా సంబంధం తెగిపోతుందంటున్నారు, మామగారు ఈ భ్రష్ట వాతావరణంలో దైవభీతి, ధర్మ నిష్ఠతలకు తావేది? ఇరుగు-పొరుగు, ఊరంతా మామగారినే బలపరుస్తున్నారు. "మీ ధోరణి కాస్తా సున్నితంగా మార్చుకోండి" అని నేనంటే వినకుండా ఉన్నారు. నా స్థితి అయోమయంగా ఉంది "ఒక వారం రోజులు సెలవు తీసుకుని గైర్ హాజర్ అవుతాను. నా పరోక్షంలో ఏమన్నాకాని—దైవేచ్ఛ" అంటున్నారు. మామగారితో తగాదాపడితే జరిగేదేమో బాగా

తెలుసు నాకు. పేరు ప్రతిష్ఠలు గల మనిషి. అల్లాహ్ రక్షణే శరణ్యం. సెలవు తీసుకుంటే అక్క దగ్గరికి వెళ్ళివద్దాం అని సలహా ఇస్తా. బావగారికి ఈ సర్వస్వం నివేదించు సలాంకు దీవెనలు.

ఆయోమయంలో నీ
బుషా.

# 10

ప్రియమయిన అక్కయ్యా!

అస్సలామొ అలైకుమ్ వ రహ్మతుల్లాహ్!

ఒక వారం అయింది మీ దగ్గర నుంచి వచ్చి. మీ ఇంట్లో బస చాలా లాభదాయకమైంది మాకు బావగారి సాంగత్యంలో చాలా విషయాలు తెలుసుకున్నారు వాడు. ఇప్పుడు తీవ్రత, తీక్షణతలు తక్కువయ్యాయి

"బావ చాలా ఆలోచనాపరుడు సుమా, అక్కయ్య కూడా గొప్ప దూరదృష్టి గల మహిళ వీరిద్దరి సాంగత్యం మహా భాగ్యం ఆ రేడు రోజుల్లోనే ఎంతో పొందగలిగాను. సజ్జనులతో గడిపిన కొన్ని క్షణాలు సంవత్సరాల తరబడి చదివిన పుస్తక జ్ఞానంకన్నా వేయి రెట్లు గొప్ప!" అని అంటూ ఉంటాడిప్పుడు వాడు.

వాడు పట్టిందే పట్టు అంటాడు ఏకాక అతివాది అని

వేరే చెప్పనక్కర్లేదు. అయినా విషయాన్ని క్రమంగా అవగాహన చేసుకుంటారని ఆశిస్తున్నా బావగారిచ్చిన పుస్తకాలు మహా ఘాటయినవే. దినమూ చదివి విపులంగా చెబుతుంటారు. "తెలుగు-ఇంగ్లీషులో బోలెడన్ని పుస్తకాలు అధ్యయనం చేశాను. కాని అన్నగారి లాంటి మనోపరివర్తన రాలేదు నాలో" అని అన్నారు నిన్న.

"ఉమ్మల్ కితాబ్ స్టడీ చేస్తే?" అని తిరిగి ఆయనే అన్నారు.

"స్టడీ" అంటే ఏమిటో చెబుతూ అరబ్బీ భాష నేర్చుకుని పవిత్ర ఖుర్ఆన్ అధ్యయనం చేయబోతున్నానని అన్నారు ఎంత శుభసూచకం. చాలా పట్టుదల గలవారు. సాధిస్తారని ఆశ ఉంది. ఆదునిక పంథాలో నేర్పించే వారెవరైనా దొరికితే బావుంటుందని వారి అభిప్రాయం. కాకుంటే, 'ఫఅల-ఫఅలా-ఫఅలూ' అంటూ కంఠస్థం ఎవరు చేయగలరు !

సరే ! వారి విషయం అలా ఉండని. మామగారి సమాచారం విను 'అఖ్తర్' సెలవు తీసుకున్నారని తెలియగానే వారికి తృప్తి కలిగింది డిప్టీ తహసీల్దారుగారితో 'మూడు వందల' బేరమయిందని వినికిడి నిజం దేవుడెరుగు ఎలాగైతేనేం మామగారు చెక్కుచెదరలేదు. మామగారు, తాతయ్య కలసి, 'చూచిన మట్టుకు చాలు, ఇకవాడి ఇంటి గడపయినా తొక్కం' అన్నారట. అంతేకాదు, వీధిలో కూడా చిచ్చుబెట్టారు. మొన్నటి నుండి ప్రతి దినం మట్టిపెళ్ళలు పడుతున్నాయి వాకిట్లో. ఒక రోజు మూడు కడవలు బ్రద్దలయ్యాయి. కిటికీ అద్దాలు పిండి పిండి అయ్యాయి. ఇంకా మేలు, చలికాలం కాబట్టి వరండాలో పడు

క్కోవడం లేదు. లేకుంటే గాయాలు తప్పేవి కావు. దీనికి తోడుగా వీధివాళ్ళకు మంచి అవకాశం లభించింది. దాతా మియాఁ సమాధి ఉంది చూశావూ ? ఈసారి వారి ఉరుసు మహా ఘనంగా జేశారు. కలకత్తా నుంచి 'కాలుఖవ్వాల్' లక్నో నుంచి సానివొకతె వచ్చింది. వీటికై 'అఖ్తర్ సాహెబ్' వద్ద చందా అడగ్గా చెవులు మూసుకున్నారు వారు. అందరూ ఎంతో చెప్పి చూశారు. ఊహుఁ ఇంట్లో నుంచి కదిలితేనా ? ఇంకేముండి ? మామగారు కాస్త 'ఊఁ' అన్నారు. వీధివాళ్ళంతా విరుచుకు పడ్డారు మా మీద. ఇంకా నయమనుకో ! మెయిన్ గేట్ ఎప్పుడూ మూసేపెడతా. లేకుంటే నేను వీధిన పడవలసి వచ్చేది. సామానూ నాశనమయ్యేది. 'వహాబి,' 'పీనాశి' అంటూ బిరుదుల వర్షం కురిపించారు. మీ ఇంటి నుంచి వచ్చాక వారు చాలా వరకు శాంతం అలవర్చుకున్నారు. ఇంట్లో తన గదిలో నుంచే, 'మొరగనివ్వూ అందర్నీ' అంటూ ఊరుకున్నారు. నా గుండె దడదడ కొట్టుకునేది 'వీళ్ళంతా ఎందుకు తిడుతున్నారు' అంటూ ఒక మూలలో బెదిరి నుంచుండిపోయింది పాపం రజియా ! ఒక గంటకుకాని ఈ గాలి-వాన తగ్గలేదు. ఇక పడుకుందాం అని మంచాలపై నడుం వాల్చేలోగా ఎవరో తలుపు తట్టారు. మేమంతా అదిరిపడ్డాం తెరవ వద్దన్నా. ఎవరో చూస్తా అంటూ పోయారు తలుపు దగ్గరికి వెళ్ళి 'ఎవరు ?' అని అడిగినదానికి, 'రహ్మతుల్లాహ్, అయిబ్ ఖాన్' అని జవాబు వచ్చింది.

"దేనికి రాక ? క్షేమమే కదా ?"

"తలుపు తెరవండి, చెప్తాం" అన్నారు బయటివారు.

తలుపు తెరిచాక లోపలికి వచ్చారు. నేనేమో చాటున ఉండి పోయాను "ఇక్కడ దోపిడి లేదా ఏదో సంఘటన జరిగేటట్టు ఉంది ఈవాళ. మేం పోలీస్ స్టేషన్‌లో తెలియబరిచి వచ్చాం. ఇంటి దాబా మీద నుంచి మీ రక్షణ చేయాలని సంకల్పించాం" అన్నారు ఆ వచ్చినవారు అభినందనలతో వారి సలహాను స్వీకరించారు పెళ్ళివారు 'వారి'నడిగితే— "నేను లంచాన్ని విసర్జించి తౌబతున్నసూహ్"* చేశాక-కష్టజీవులనీ-శ్రామికులనీ తలచి తలా మూడు వందల రూపాయలు ఇచ్చాను వీళ్ళకు. దానితో నే హాయిగా సంపాదించి భార్యాపిల్లల్ని తృప్తిగా పోషించుకుంటున్నా రిప్పుడు' అన్నారు.

రాత్రంతా జాగరణే చేశాం. అప్పటికీ తెల్లారే ముందు రెప్ప వాలింది. ఇంకా నిద్ర సరిగ్గా పట్టనే లేదు. "హారు" హాఁ హాఁ అంటూ మేలుకున్నారు. నాకూ మెలకువ వచ్చింది- రజియా కూడా మేల్కొంది. రహ్మతుల్లా, ఆబిద్ ఖాన్ కలిసి, ముజఫ్ఫర్, జంగీ ఖాన్ అనేవారిని పట్టుకున్నారని తరువాత తెలిసింది. వాళ్ళిద్దరూ ప్రాధేయపడి వేడుకుంటున్నారు వారిని.

వీళ్ళిద్దరూ దొంగలో దోపిడిగాళ్ళో కారని నా అభిప్రాయం. "ఎవరో ఆశజూపి మోసం చేశారు. వీళ్ళని క్షమించివేయండి. దేవుడే ఉన్నాడు. పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళకండి" అన్నాను. నా మాట విని ఇద్దరినీ విడిచిపెట్టారు.

"మీ ప్రాణాలు తీయటానికి వచ్చాం. ఇప్పుడు మీ బానిసలం. మీ మేలు ఎన్నటికీ మరువలేం. దైవచిత్తమయితే

* పశ్చాత్తాపంతో సన్మార్గావలంబన.

ఏదో సేవ చేసుకుంటాం" అంటూ కృతజ్ఞత తెలుపుకున్నారిద్దరు. రాత్రి ఎలాగో గడిచింది తెల్లారి వీధివాళ్ళు ఏదయినా గలభా చేస్తారేమో అని అనుకున్నాం.

మావారు మస్జిద్‌కు వెళ్ళారు. ఇంట్లో సరుకంతా తెచ్చారు. ఎవరూ ఏ విధమైన రగడ చేయలేదు. అబిద్ ఖాన్, రహ్మతుల్లా. జంగీ ఖాన్, ముజఫ్ఫర్ నలుగురిలో ఎవరో కాస్త బెదిరించి ఉంటారు

అక్కా, ఈ విషయం ఎలాగో ముగిసింది. అల్లాహ్‌కు కోటానుకోట్ల అభినందనలు ఇక మీదట ఏం జరగనుందో, రోజూ ఈ నల్గురి మిత్రుల్ని తన రూంలోకి పిలుచుకువచ్చి, తనకు ఇష్టమయిన పుస్తకాల్లో ఏవో వినిపించి అర్థం చెప్పడం మామూలయిపోయింది. దేవుని ఏకత్వమూ—దాని ఆవశ్యకత నొక్కి చెప్తుంటాడు. ఈ నల్గురూ దీన్ విషయాన్ని కాస్తోకూస్తో అర్థం చేసుకుంటారని నమ్మకం.

"అసర్-మగ్‌రిబ్"నమాజుల మధ్యకాలంలో అర్థగంటపాటు మద్రసయె ఇస్లామియాకెళ్ళి మౌలానాగారి వద్ద అరబ్బీ చదువుతున్నాడు. నీవు మా కొరకు నిత్యం దేవుని ప్రార్థించు. ఇంట్లో అందరికీ సలాములు.

వస్సలామ్,

నీ బుష్రా.

# 11

అక్కయ్యా!

అస్సలాము అలైకుమ్.

ఈమధ్య 'పాపు' అరబ్బీ నేర్చుకోవటంలో పూర్తిగా నిమగ్నులయి ఉన్నారు. మౌలానాగారు చాలా ప్రేమతో కృషి చేస్తున్నారు. "దీన్" విషయాల్ని కూడా ఎంతో సలక్షణంగా చర్చిస్తున్నారు. ఇప్పుడు అక్తర్ సాహెబ్‌లో ఉన్న సామర్థ్యాలు క్రమేణ అంకురిస్తున్నాయి. కొంతవరకు మీ పుస్తకాలే వాటిని పురిగొల్పాయి. ఇప్పుడు అత్యుత్తమమైన శిక్షణ లభిస్తూ ఉంది ముఖ్యంగా సంస్కరణ జరిగేది పొరుగువాళ్ళ ఆక్షేపణ మూలంగానే. దాతా మియాం ఉర్సులో నాట్యం, పాట, కచ్చేరీలను వ్యతిరేకించి చంపా ఇష్టంలేదు కదా! ఇక ఎవర్ని చూసినా ఏదో ఒక డొంక తిరుగుడు ఆక్షేపణ చేస్తూనే ఉన్నారు నా ముందు తరుచుగా వాటిని ప్రస్తావించారు. ఇప్పుడు కాస్తకాస్తగా నా అభిప్రాయాన్ని తెలుపుతున్నా.

"చిత్రమయినవాళ్ళీ మనుష్యులు. ప్రపంచ ధనార్జనలో మునిగి ఉన్న కాలంలో నన్ను మాన్పించడానికి నిషేధించే

సుబుద్ధి ఎవ్వరికీ కలగలేదు. రోజుకు నూరు అబద్ధాలాడినా శ్రద్ధ తీసుకున్నవాడు లేడు. వారానికి రెండు రోజులు సినిమా ప్రోగ్రాం వేసుకున్నా ఎవ్వరూ నోరు కదపలేదు లంచం పుచ్చుకుంటూ అధర్మ సంపాదన ప్రోగు చేస్తూ ఉంటే ఎవరికీ నోరు కదిపే ధైర్యం కలగలేదు. నేడు ఇస్లామ్ శిక్షణల ప్రకారం తన్నుతాను మార్చుకోదల్చుకుంటే అన్ని వైపులా దాడి చేస్తున్నారు. 'అ, ఆ'లు రానట్టి దద్దమ్మ కూడ ఆక్షేపణ చేస్తాడు. ప్రతి ఒక్కడూ పెద్ద మౌల్వీగా తయారయ్యాడు."

"ఇంతవరకు ముస్లిమ్‌లందరూ చేసేదాన్ని తప్పంటూ తన జానెడు మస్జిద్ వేరే నిర్మిస్తాడేమో" అంటాడు

"తాతముత్తాతలందరూ అవివేకులా ? ముందు ఇస్లామీ పుస్తకాలు లేకపోయాయా ? ఇంతవరకు ఎవరూ వివాహ ఉత్సవాలను, ఆచారాలను నిషేధించలేదు ఊడిపడ్డాడెక్కడనుంచి వచ్చారో కొత్త మౌల్వీగారు !" అని వెటకారంగా మాట్లాడుతాడు మరొకడు.

ఇంకొకడు— "సరే ! అంతా వాస్తవమే, గడ్డం తీయడం హరామ్ కాదా ? సూటు, బూటు, హేటు వేయడం ఉచితమేనా ? పేకాటాడటం షరీఅత్‌లో అనుమతింపబడి ఉందా ?" అంటాడు.

"నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నారందరూ" అని ఒక రోజు వీధివాళ్ళను గురించి వాపోయారు. వారిని ఈ చిక్కుల్లో చూచి ఒక రోజు ధైర్యంగా చిన్న ఉపన్యాసమిచ్చాను, "అసలు ఈ దశలోనే మానవుడు అపజయం పొంది తిరిగి మొదటికే చేరుకుం

టాడు. మరి ఆ స్థానంలో కూడ నిలువజాలడు. అధఃపతనానికి గురవుతాడు. కాని కాస్త ధైర్యం ప్రదర్శిస్తే ప్రజల నిందలు, అపవాదులు సహిస్తాడు. అంతేకాదు, వాటిలో వాస్తవికత ఎంత వరకుందో పరిశీలించి, తనలోగల పొరపాట్లను సరిజేసుకుంటాడు. అలాంటప్పుడు ఈ వ్యంగం, నిందల వాతావరణం సంస్కర్తగా తయారై, కష్టపడి మిగిలిపోయిన లోపాల్ని కూడ దూరం చేస్తుంది. వెదికి వెదికి ఒక్కొక్క దోషాన్నే సూచిస్తుంది- విమర్శకుడు వాత్సల్యం లేనివాడయినా, ముఖస్తుతులు చేసి అహంకారాన్ని పెంపొందింపజేసే మిత్రునికన్నా ఎన్నో రెట్లు మేలు వాస్తవంగా ఇది దైవప్రాప్తమయిన శిక్షణా మార్గం. అల్లాహ్ తన విధేయులయిన దాసుల లోటుపాట్లను ఇలాగే దూరం చేస్తాడు వీటిని మానవుడు సౌమ్యంగా సహించాడంటే ఈ కొలిమిలో కాలి కుందనమయి బయటపడతాడు. ప్రవక్తల నందరినీ ప్రజలు ఇదే విధంగా కష్టపెట్టారు. సహాబా (మహా ప్రవక్త సహచరులు)వారూ, గొప్ప గొప్ప దైవభక్తులందరూ ఈ కొలిమిలో పరిపక్వం జెందినవారే. తరువాతనే ఇస్లామ్ శౌర్యశీలురయిన సైనికుల్ని పొందగలిగింది కాబట్టి ఈ విధమయిన వాతావరణాన్ని దైవానుగ్రహమనుకోవలసి ఉంటుంది. మన నమ్మకాలను ప్రకటించేవారు మనకు చిల్లిగవ్వ ఖర్చు లేకుండా వాస్తవంగా మన దోషాలను తెలియబరుస్తున్నారు. ఇక వీటితో, హితాన్ని పొందడమో, జంకి వెనుకంజవేయడమో అన్నది మన బాధ్యత. హాలాహలాన్ని కూడ ఇష్టంతో పుచ్చుకుంటే అమృతమై పోతుందట" అని ఒక చిన్న ఉపన్యాసం దంచేశానక్కా !

నా ఈ ఉపన్యాసాన్ని బాగా శ్రద్ధగా విన్నారు వారు. ఇది

చాలా నచ్చింది. చిరునవ్వుతో ఆశ్చర్యంగా "ముల్లానిగారు, మీలో ఎన్ని సద్గుణాలున్నాయ్. నేను నీ విలువను గ్రహించ లేకపోయాను. అసలు నీవల్లే కాస్త తగ్గేవాణ్ణి, ఇక నీవే ప్రోత్సహిస్తే, ఇన్షా అల్లాహ్, వెనుకంజవేసే ప్రసక్తే లేదు. వాస్తవంగా నాలో కొన్ని లోట్లున్నాయ్: ముఖంపై గడ్డం లేదు. ఆక్షేపణలూ, విమర్శలూ వస్తే ఛీదరించుకుంటాను. ఏదో కారణంగా నాపై కోపంలో ఉన్న బంధువుల్ని ఇంతవరకు పరి ప్రచ్ఛలేకపోయాను. ఇస్లామ్ విధించే బాధ్యతలు తెలిశాక నాలో కాస్త గర్వం వచ్చింది. చివరికి ఇతర ముస్లిములనే మంచి భావనతో చూడటం మానేశా. దైవచిత్తమయితే ధోరణి మార్చు కుంటా! చిన్న, పెద్ద, శ్రీమంతుడు, బీదవాడు, విద్యావంతుడు, నిరక్షరాశి అన్న తారతమ్యం లేకుండా అందరితోనూ సమానంగా వ్యవహరిస్తా. వీలయినంతవరకు సలామ్ నేనే ముందు చేస్తా. దేవుని ఆజ్ఞలను జవదాటక ఎలాగో బంధువుల్ని కూడా సముదా యించుకుంటా వింటున్నావా బుష్రా? ఇక గడ్డం కూడ! అంటూ చెంపలపై చేయి వేసి, "లాహౌల వలా ఖువ్వత్, ఎంతగా తోమాను ఈ చర్మాన్ని" అన్నాడు. "తోమడం"పై ఇద్దరం నవ్వు కున్నాం.

ఒక వారమయింది. గడ్డానికి కత్తి అందలేదు. బాగా గుబురుగా పెరిగింది గడ్డం. ఎర్రటి ముఖంపై నల్లటి గడ్డం చాలా బాగుంది నిన్న ఆదివారం నాడు మౌలానాకు విందు చేశాం. వారు కూడ 'సుబహానల్లా' అంటూ ప్రశంసించారు.

చూశావా అక్కా! వాస్తవంగా మనిషి కార్యరంగంలో దిగ నంతవరకు అతనిలో నిలకడ రాదు. అల్లాహ్ మమ్మల్ని దీన్‌పై

నిలకడగా ఉండేందుకు శక్తి ప్రసాదించేలా ప్రార్థించు. ప్రైమరీ ముగించి తొలి వాచకం మొదలుపెట్టింది రజియా ! ఇక్కడి వాళ్ళంతా అక్కడివాళ్ళందరికి సలాములు చెబుతున్నారు.

వస్సలామ్.

బుషా

# 12

అక్కయ్యా !

అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్.

ఈసారి నీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూనే ఉండిపోయా ! కాని బావగారు తన తోటి అల్లునికి వ్రాసిన ఉత్తరం నీ ఉత్తరం కొరవను తీర్చివేసింది. దాని ద్వారే "అఖ్తర్ సాహెబ్" ఇక్కడ ఉద్యోగం వదిలెట్టే సన్నాహాలు చేస్తున్నట్లు తెలిసింది. బహుశా బావగారితో సంప్రతించి ఉంటారు. దానికి బదులే బావగారు వ్రాసింది. నాకు చూపిస్తూ— బావగారు ఏ సలహా ఇవ్వకుండా అయోమయంగా వదిలారంటూ నా చేతికిచ్చారు. బావగారు వ్రాసింది ఇది :

"ఉద్యోగం వదలిపెట్టే విషయంలో ఏమని చెప్పగలను ! అటో ఇటో ఏకదీక్షగా ఉండాలి. అం, మీ హృదయాన్ని అడ

గండి. అదేమని తీర్మానిస్తుందో! ఉద్యోగం వదిలాక ఏదైనా చిక్కు సంభవిస్తే దాన్ని ఎదుర్కోలేకపోయారంటే చాలా చెడ్డ ప్రభావం పడుతుంది సుమా! ఈ విషయంలో ఇతరులు ఏమని సలహా ఇవ్వగలరు?"

బావగారు చాలా దూరదృష్టితోనే ఇలా వ్రాశారు. కాని 'వారికి' దీనితో తృప్తి కలుగలేదు, ఉద్యోగంతో జేజారెత్తించి పెరికి. "లంచం తినడం మానేశాక స్టాఫ్ మొత్తం ఎదురు తిరిగింది నాకు" అంటూ ఉంటారు. కారణమడిగితే. "అందరూ కాస్త బద్ధులయి ఉండవలసింది ఉంటుంది. ఇంకా దైవం రక్షణ ఉండటం వల్ల మేలు గలిగింది. లేకుంటే ఇంతవరకు నీచంగా ఉద్యోగం నుంచి తీసివేసి ఉండేవాడు. ఓ సందర్భంలో నయితే నా కొరిస్పె నలువైపుల నుండి బంధించి వేశారు కాని డిప్యూటీ కమిషనర్‌గారు అసలు సమాచారాన్ని స్పష్టంగా ఎరిగి ఉండటం వల్ల ఏ అపాంతమూ వాటిల్లలేదు. అందులో తహసీల్దారు కూడా విరుద్ధంగా రిపోర్టు చేసి ఉన్నాడు దీన్నుంచి బయటపడ్డాక వారికింకా కోర్టుకెక్కడం సమ్మతంగా లేదు ఎన్నో వ్యవహారాలు తప్పుగా జరిగాయి మనస్సుకు ఎంతో బాధ కలుగుతుంది ఏం చెయ్యాలో తోచడం లేదు."

గడ్డం వదిలినప్పటి నుంచి తేనెతుట్టును కదిపినట్టే అనుకో. విశేషమేమంటే, వాస్తవంగా అఖ్తర్ సాహెబ్‌లో కలిగిన ఈ విప్లవం ఉత్తమమయినదే. కాని నేటి ప్రపంచంతో అది సరిపడదు. ముస్లిమ్ క్లర్కులు వ్యతిరేకతలో ముమ్ముందు ఉంటున్నారు. అదే శోచనీయ విషయం. హిందువులే కొంత వరకు నయం. బహుశా ముస్లిమ్ క్లర్కులకు వీరి అద్దంలో తమ నిజ

ప్రతాపం కనిపిస్తుంది కాబోలు. ఈ విధంగా వారు నా ముందు బాహాటంగా నేను నిక్కచ్చిగా చెప్పివేశాను. 'ఛీ, వదిలేయండీ ఈ పాడు ఉద్యోగం. దేవుడే పోషకుడు. ఆయన మానవునికి ఉత్కృష్టమయిన మార్గాన్ని ప్రసాదిస్తాడు. గొప్ప ఆడంబరం లేకపోయినా ముఖ్యావసరాలు ఎలాగనా పూర్తవుతాయి. ఉద్యోగం లేనివారు బ్రతకటం లేదా?'

రహమా అన్నయ్యగారికి ఓ వైపు నా మాటలు విని కాస్త ధైర్యం కలుగుతుంది. "ఇక రాజీనామా ఇచ్చివేస్తానంటూనే బయలుదేరతారు. కాని గడప దాటి మిత్రులతో సంప్రదించగానే సంకల్పం కాస్త మెత్తబడుతుంది మౌలానాను ఒకసారి టీకి పిలిపించి వారి సలహా తీసుకోవాలని ఒక ఆలోచన కలిగింది. వారు ఏదో ఒక స్థిర నిశ్చయం తెలిపితే అక్బర్ సాహెబ్ ఎప్పుడూ ఏకదీక్షగా ఉంటారని ఆశగా ఉంది

అన్నా, బావా కలిసి మా భవిష్యత్తు కొరకు ఏదో ఒక ప్రణాళికం ఈపాటికి చూపెట్టి ఉండవలసింది చివరికి ఒక రోజు అదే పరిణమించేగా వారు ఉద్యోగాన్ని వదలకపోయినా, ఇన్షా అల్లాహ్ ఉద్యోగం వారిని వదిలివేస్తుంది. అప్పుడు కాబోలు మీరంతా సలహాలిస్తారు! ఇంకా ఎవరి వద్ద సలహా అడుగుతాము? అబిద్ ఖాన్, రహ్మతుల్లా వగైరాలేమో, "ఇదో మా అంగడి ఉంది. వాస్తవానికి ఇది మీ పాదాల పుణ్యమే. మీ ఇష్టం వచ్చినట్టు వ్యాపారం చేయండి. మీ క్రింద పని చేస్తాము" అంటున్నారు. ఆత్మాభిమానం గల ఒక వ్యక్తి ద్వారా ఆశ్చర్యపనేనా ఇది? అబిద్ ఖాన్, రహ్మతుల్లాహ్‌గార్లకు ధన్యవాదాలు తెలుపుకున్నారాయన. నా దృష్టిలో కొన్ని మార్గాలు

గోచరించాయి. వాటిని వారి సమక్షంలో ప్రతిపాదించాను కూడ. మొదటిది, వీరూ, బావగారు కలిసి ఒక పత్రిక ప్రచురించాలి. దాని లక్ష్యం సన్మార్గ ప్రచారమై ఉండాలి. బావగారు కూడ చాలా కాలంగా చెబుతూనే ఉండిపోయారు. రెండవ ప్రతిపాదన. నా నగలు, వెయ్యి పైచిలుకు ఖరీదు కాగలవు. వాటిని అమ్మేసి వ్యాపారం చేయాలని. దీనికి వీరు సమ్మతించరు. మూడోది, ఈ గ్రామాన్ని వదిలేసి పట్టణంలో మకాం వెయ్యాలని ఏదో ఒక ఉద్యోగం లభించే వరకు ట్యూషన్ ఏదయినా చెయ్యొచ్చు నూర్పురం విడవడానికి వారు సిద్ధంగా లేరు. "మనపై ప్రప్రథమంగా నూర్పురం హక్కు అధికం. ఇక్కడే స్థిరంగా సన్మార్గ ప్రచారం చేయడం మన విధి" అనంటారు వారు. నా ప్రతిపాదనలు వారికి అంగీకార యోగ్యంగా లేవు. వేరే ఏం చేయాలో అదీ చెప్పరు ఏ మార్గమూ గోచరించక కాబోలు రాజీనామా ఇవ్వడానికి జంకుతున్నారు. కాని చాలా విషమ పరిస్థితిలో ఉన్నారు. ఆఫీస్‌లో అడుగు పెట్టగానే అగ్నికణాలు తొక్కినట్టు అనుభూతి కలుగుతుందనంటారు.

అక్కయ్యా! ఇదొక పరిష్కారంకాని పెద్ద చిక్కుగా తయారయింది ధైర్యముండాలిగాని పరిష్కారానికేంలె ఆస్తి సరే. రజియా అన్నయ్య మనసు ఇంకా కుదుటపడలేదు ఇతరత్రా అంతా కుశలమే ఇంట్లో రజియాకాక, పొరుగు నుంచి ఇద్దరమ్మాయిలు చదువుకోవడానికి వస్తున్నారు. ద్వైపాక్షిప పట్ల

ఇప్పుడిప్పుడే మా పొరుగువారు మాతో ఏకీభవిస్తున్నారు. మా వాడికి ఇద్దరు సానుభూతిపరులు లభించారు.

మీ కుశల సమాచారాన్ని త్వరగా తెలియపరిచేది.

వస్సలామ్.

అయోమయంలో

బుష్రా.

# 13

అదా విషయం అక్కయ్యా!

ఉద్యోగం వదలడమో, కూడదో అనే విషయంలో నీవు, బావగారు సలహా ఇవ్వక వారి అభీష్టం పైనే వదిలేసిన సంగతి ఇప్పటికీగాని నాకు అర్థం కాలేదు.

'రాజీనామా ఇచ్చివేయండి' అని బావగారు ఖచ్చితంగా ఎందుకు వ్రాయలేదో నీ తాజా ఉత్తరం చూచాక బోధపడింది. ఎప్పుడూ మానవదృష్టితోనే వ్యవహరించాలనే నీ అభిప్రాయం సరియైనదే. ఉద్రేకంతో ఒక కార్యం చేసేసి దానిపై నిలకడ లేకపోతే దాని ప్రభావం చాలా హానికరంగా పడుతుంది. తొలి పెట్టుపై కూడ నిలబడలేకపోవచ్చు. మాటిమాటికి ఉద్యోగంలోని కీడులనయితే వల్లిస్తారుకాని ఇప్పటికీ దాన్ని వదలలేక

పోతున్నారాయన. ఒకసారయితే "మొరిగేవి-కరువవు" అనేద్దామని తలంచాను. కాని దాన్ని దూషణగా, అసహ్యంగా అపార్థం చేసుకుంటారని ఊరుకున్నాను. ఇంతవరకు ఉత్తరం ముగించాను. అంతలోనే వారు వచ్చేశారు. ఆఫీస్ టైమ్ అవక ముందే వచ్చేయడం ఆశ్చర్యం కలిగించింది నాకు. ఉత్తరం అలా ఉంచేసి ఈ ఎకాఎకీ రాక గురించి అడిగా."ఒక సంవత్సరం పాటు సెలవు తీసుకున్నా"నని సమాధానమిచ్చారు.

ఎందుకూ అనడిగా, "ఈలోగా ఎలాగో తంటాలుపడి అదృష్టం ఎలాగుందో పరీక్షిద్దామనుకున్నా" అని ఇంకేమో అనబోగా, మాటకు అడ్డువచ్చి, "ఈలోగా వజ్రకిరీటం లభిస్తే రాజీనామాను, లేకపోతే— మునుపటిలాగే మనమూ మన రేయింబవళ్ళూనూ. డాక్టర్ ఇక్బాల్ కావ్యమొకటి పఠిస్తూ ఉండేవారే మీరు, అదేదో జ్ఞాపకం రావడంలేదు. భావం మాత్రం మీరే చెప్పింది, బాగా గుర్తుంది.

"మనిషి తరచుగా పర్యవసానాన్ని చింతించి, నష్టం, కష్టం కలుగుతుందేమో అన్న సందేహం వల్లనే ఒక గొప్ప కార్యాన్ని ప్రారంభించలేకపోతాడు. కాని మోమిన్ ఈ విధంగా తలంచడు."

'ఇంతేగా మీరు చెప్పిన భావం?' సూటిగా వారి కన్నుల్లోకి చూస్తూ వడివడిగా చెప్పేశాను ఈ వాక్యాలు.

విని ఏదో చెప్పడానికి ప్రయత్నించారు. కాని చెప్పలేక పోయారు. పెదాలు వణికిపోయాయి.

వారిలా మంచాన మేను వాల్చగానే వంట మొదలు

పెట్టాను నేను. మగరిబ్ కన్నా ముందుగానే భోజనం తయారు చేశాను ఆ తరువాత వారి దగ్గరికెళితే ఇంగ్లీషులో ఏదో వ్రాసుకుంటున్నారు. నా వైపు ఒకసారి అలా చూచి మళ్ళీ వ్రాయడం ప్రారంభించారు వ్రాయడం ముగించాక కాగితం మడచి కవరులో పెట్టారు.

"బావగారికి ఉత్తరం వ్రాశారా ? నా తరఫున సలాము వ్రాయండి" అన్నాను.

"బావగారికి కాదు, డిప్టి కమీషనర్‌గారి సమ్ముఖాని కెళుతుంది ఈ కవర్ !" అన్నారాయన

"ఏముంది అందులో ?"

"రాజీనామా !" అంటూ మేజాపై పెట్టేశారు కవర్

"పీడ వదిలింది దేవునికి ధన్యవాదాలు. ఇక పదండి, భోంచేయండి. బాగా ఆకలిగా ఉందంటుంది రజియా ! ఇంకా 15 నిమిషాలు ఉన్నాయి మగరిబ్‌కు" అన్నాను.

వారు లేచారు. దస్తర్ పరచి అన్నం వడ్డించాను. బోజనాలు ముగించి మస్జిద్‌కి వెళ్ళారు వారు నేనూ రజియాతో సహా నమాజ్‌కు నిలబడ్డాను.

ఇదక్కా, ఈ వారం కథ. నాలుగయిదు రోజులు మీ సన్నిధిలో వారితో సహా ఉందామని ఆలోచిస్తున్నాను. మానసిక వ్యధ కాస్త దూరమవుతుంది అందరం కలిసి భావి ప్రోగ్రామ్ ఆలోచించవచ్చు

ఈ విషయం వారితోనే ప్రస్తావించా, సమ్మతించారు. మీ అనతి లభించినదంటే ఇన్షా అల్లాహ్ బయలుదేరామనుకో.

రాజీనామా డిప్టి కమిషనర్ దగ్గరికి చేరింది. మునుపేమో ఆఫీ సంతా ప్రచారమయింది. ఇప్పుడయితే ఏ నోట విన్నా అదే మాట. మౌలానాగారేమో, "చాలా మంచి పని చేశారు, దేవు డేదో మార్గం చూపిస్తాడు" అన్నారు. కాని జనులు నానా విధంగా మాట్లాడుతున్నారు. "ఇది కృతఘ్నత, ఇంటి చేరిన భాగ్యాన్ని కాలదన్నటం" లాంటిది. ఏదో "పౌరుషంతో రాజీ నామానయితే ఇచ్చివేశారుగాని తరువాత బాధపడుతారు' అంటూ నోటికొచ్చినట్టు దూషిస్తున్నారు, ఇక చూడు ఏమవుతుందో. ప్రవాహంలో దిగేశాం. ఇక దేవుడే రక్ష.

మా అందరి సలాములు స్వీకరించు. బావగారికి కూడ నివేదించు.

సలాముకు ముద్దులు
నీ బుషా.

# 14

ప్రియమయిన అక్కా,

అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి వ బరకాతుహ్.

మీ దగ్గర సెలవు తీసుకుని మేమందరం క్షేమంగా ఇంటికి చేరాము. రాగానే ఉత్తరం వ్రాయవలసింది; ఇవాళ, రేపూ అనుకుంటూనే వారం గడిచిపోయింది. ఆయన ఏమైనా చెయ్యటం మొదలెడితే మీకు వ్రాద్దామనుకున్నాను. దైవ కృప వల్ల నిన్న వ్యవహారం ఓ కొలిక్కి వచ్చింది. ఆయనగారు నిన్న సాయంత్రమే ఆబిద్ ఖాన్, రహ్మతుల్లాగార్ల వెంట ఢిల్లీకని రైలెక్కారు. ఈవేళ నేను నీకు వ్రాస్తున్నాను. నీవు నా ఉత్తరం కోసం బాగా ఎదురు చూశావనుకుంటా. కోపం కూడా వచ్చింది కదూ, తరువాత కోపగించుకుందువుగాని ముందు ఈ వారం కథ విను.

నీవున్నూ బావగారు కలసి ఇచ్చిన సలహాను గురించి ఆబిద్ ఖాన్, రహ్మతుల్లాగార్లను కూడా సంప్రతించారు వారుభయులూ రైటన్నారు. పైగా ప్రోత్సహించడానికేమో ఇంకా రెండాకులు ఎక్కువే చెప్పారు. వాళ్ళ మాటలోనూ బలముం

దనుకో. రబీ పంటలు కోతకు వచ్చాయి పండుగలు కూడా కలసివచ్చాయి. రమజాన్ నెల కూడా. ఈ పరిస్థితుల్లో ఏ కుర్రవానికి కాస్త సమంజసమయిన పని కల్పించినా, అతనూ ఎంతో కొంత సంపాయించుకోగలడు. అఖ్తర్‌గారయితే చదువు కున్న వ్యక్తి, బుద్ధికుశలత ఉన్నవారు, యువకులు, ఆశలున్న మనిషాయె! మొదట్లో కాస్త బింకం చూపెట్టారు. కాని దేవుని దయ వల్ల నీవూ, బావగారు కలసి ఓ వారం రోజులు చేసిన బోధ ఫలించింది. బింకం వీడి దిగివచ్చారు. పోతే పెట్టుబడి సమస్య ఎదురయింది ముందు సైకిలు అమ్మేస్తానన్నారు. నేనూ వ్యతిరేకించాను, ఆబిద్ ఖాన్, రహ్మతుల్లా కూడా నన్ను సమర్థించారు. చివరికి నేను నా బంగారు గాజులు, చెవి రింగులు ముందుంచాను "ఇదంతా మీ సొత్తేగా, నేడు కాక పోతే ఎప్పుడు పనికివస్తాయని? నాకు స్వయంగానూ నగలంటే ఇష్టం లేదు. పైగా ఈ పాతకాలపు నగలు ఎవరికి కావాలి. పల్లె స్త్రీలే వీటిని ఇష్టపడతారు" అని ఏదేదో చెప్పినా ఆయన తలకెక్కలేదు.

ఆయన ఆత్మాభిమానానికి నేనేమని చెప్పనక్కా, ఒకసారి లేదన్నారంటే అంతే. దాని మీదట ఆబిద్ ఖాన్, రహ్మతుల్లా గార్లు, "వ్యాపారంలో పెట్టుబడికన్నా ముఖ్యం పలుకుబడి కావాలి నిజాయితీ, నమ్మకాల ద్వారా పలుకుబడి వస్తుంది. పదండి, అల్లాహ్ పేరు చెప్పుకుని బయల్దేరుదాం. మేము ఢిల్లీ నుంచేగా సరకు తెచ్చేది. మేము కూడా అప్పో సప్పో తెస్తూనే ఉంటాము, మేమూ హామి నిలచి మీకూ సరకు ఇప్పిస్తాము పదండి" అని అన్నారు

రజియహా అన్హుయ్యకు ఇంకా బింకవే. అంతా ధార్మిక కార్యకలాపాల్లోని మిత్రబృందం. రహ్మతుల్లా, అబిద్ ఖాన్. ముజఫ్ఫర్— వీరంతా ఏడుగురు. ఒకే కుటుంబంలా ఉంటారు. చిన్నా పెద్దా తారతమ్యం లేదు. కులం, వర్ణం మాటే లేదు సుబహానల్లాహ్ సిద్ధాంతాల దృష్ట్యా ఏర్పడిన ఏకత ఎంత గొప్పది. దానికితోడు విశ్వాస పటిష్ఠత కూడా మహా వర ప్రసాదం. ఎంతటి పరాయివారయినా కలసిపోతారు !

ఆ, ఆయన ఆ ప్రతిపాదననూ కాదనగానే అందరూ ఒక్కసారిగా ఎగబడ్డారు "అయితే మీరెంకా మమ్మల్ని పరాయి వారిలానే భావిస్తున్నారన్న మాట దురదృష్టవశాత్తు మేమూ ఏదయినా పనిబడితే మీ వద్దకు రాకూడదన్న మాట అయితే ఈ సలహా సంప్రతింపులు దేనికీ? మీరేగా ఓ సహాబి (ప్రవక్త సహచరుని) కథ వినిపించారు ?

ఆ సహాబి ఓ యూదుని వద్ద బానిసగా ఉండేవాడు. యూదునికి ధనాశ ఎక్కువ గనక—"నీవు 300 ఖర్జూరపు చెట్లు నాటి ఇంత బంగారం ఇచ్చావంటే నిన్ను విడుదల చేస్తాను" అని అన్నాడు. ఆ సహాబి పాపం ప్రవక్త మహనీయుని (సఅసం) వద్దకు వచ్చారు. సంగతి అంతా వివరించారు ఆ మహనీయుడు ఇతర సహచరుల్ని తీసుకుని వెంటనే బయల్దేరారు. ప్రవక్తా (సఅసం), ప్రవక్త సహచరులూ (రఅ.) కలసి కాసేపట్లోనే ఆ చెట్లు నాటేశారు. ఆ రోజే బైతుల్‌మాల్లో బంగారమూ వచ్చింది. అది సహాబీకి ఇచ్చి, ఆ యూదునికి ఇవ్వవలసిందిగా, బానిసత్వం నుండి విముక్తిని పొందవలసిందిగా ఫర్మాయించారు దైవ ప్రవక్త (సఅసం).

అఖ్తర్‌గారూ ఇక చెప్పండి, మనమంతా ఆ పవిత్ర జీవితాన్నే కదా అనుసరించవలసిందీ. అవసరం ఏర్పడితే మనం మన సోదరులకు సహాయం చెయ్యకూడదా ?"

ఇలా మిత్రులందరూ నిలదీయగానే అయ్యగారు చల్లబడ్డారు. సాయంత్రం అబిద్ ఖాన్, రహ్మతుల్లాగార్లతో బయల్దేరారు.

ఆయనేమో ఢిల్లీ వెళ్ళారు. నాకేమో గాభరాగా ఉంది. ఆయన క్షేమంగా, పని ఫలప్రదం చేసుకురావాలని వేడుకుంటున్నాను. మీరున్నూ దుఆ చెయ్యండి. కొత్త వ్యవహారం, నాకేమిటో రకరకాల ఆలోచనలు ముసురుకుంటున్నాయి. రజియా ప్రశాంతంగా నిద్రపోతుంది. సల్మాను బాగా జ్ఞాపకం చేస్తూ ఉంటుంది. ఇద్దరూ బాగా కలసిపోయ్యారు. నా తరఫునా, రజియా తరఫునా సలామ్ స్వీకరించండి.

మీ

బుషా్ర.

# 15

అక్కయ్యా,

సలాములు.

నేను ముందే ప్రామిసుగా ఉత్తరం రాయడానికి ఆలస్య మెందుకయిందో. అయినా నీ చీవాట్లు తప్పలేదు. పోనీ ఈసారి నీ లెటర్ అందగానే జవాబు వ్రాస్తున్నాను. అక్కయ్యా మా సమాచారం తెలుసుకునేందుకు నీకెంత ,ఆతృత ఉందో, అంతకన్నా ఎక్కువగానే నాకూ తొందర—నీకు అంతా తెలుపా లని! సంతోషించావా?

ఆపైనేమయిందో విను. ఢిల్లీ నుంచి మూడవ రోజున వచ్చాను. ఆయిదో రోజున ఓ బట్టల పేక్ తెచ్చిపడేశాడు బంతి వాడు. ఇందులో ఏముందీ అని నేనడిగితే—కట్ పీసెస్ అని సమాధానమిచ్చారాయన. ఇంకా "బాగా అగువగా దొరికిందని ఆసిఫ్ ఖాన్, రహ్మతుల్లా అంటున్నారు బాగానే పోతుందట!" అన్నారాయన మెరిసే కళ్ళతో. పేక్ విప్పితే అన్నీ రంగు రంగుల బట్టలు. మా పొరుగువాళ్ళ పాప, నా దగ్గర చదువు కునే అన్వరీ, దాని అక్క సర్వరీ అప్పుడు ఇంట్లోనే ఉన్నారు.

"అబ్బో, ఎంత మంచి బట్టలు, ఫ్రాకులకు, బ్లౌజులకూ !" అంటూ గంతులేశారు. అంటూనే ఇంటికి పరుగెత్తింది. నిమిషంలో వీధంతా మా ఆయన కట్ పీసెస్ తెచ్చారన్న వార్త పాకి పోయింది.

దైవ కృప చూడక్కా ! ఎవరో అన్నట్టు ఆయన కృపకు ఆలస్యముండదన్నది నిజమే. విన్నది తడవుగానే అనేక మంది వచ్చి చూసి వెళ్ళారు. ధర చెప్పమని ఒకటే గోల. పండుగ కదా, పిల్లలకు మంచి మంచి బట్టలాయె. ఈయనగారికేమో ధరలే జ్ఞాపకం లేవు. కొత్త వ్యవహారం. 'ధర' చెప్పడం ఎలానో తెలీదు. తరువాత రహ్మతుల్లా, ఆబిద్ ఖాన్‌లు వచ్చి ఈ సమస్యను పరిష్కరించారు. శాల్తీలు వేరు చేశారు. దాదాపు ఇరువయి రకాల పీసెస్ అవి. గజం మొదలుకుని నాలుగు గజాల వరకు.

ఆబిద్ ఖాన్, రహ్మతుల్లాలు వచ్చి ధరలు నిర్ణయించి మరీ వెళ్ళారు. నేను రజియా చేత—లాబాలు అధికంగా ఉండ రాదని చెప్పి పంపాను. ఇంకా, ఇస్లామీయ నియమాలను ఎట్టి పరిస్థితుల్లోనూ జవదాటరాదని, అందరికీ ఒకే ధరన ఇవ్వా లని, పిల్లలయినా, పెద్దలయినా ధర మార్చి పలకరాదని చెప్పి పంపాను రజియా అన్నయ్యను పిలిపించి, నీవెప్పుడో ఉత్తరంలో వ్రాసిన ఓ హదీసును వినిపించాను. మహనీయ ముహమ్మద్ అందులో ఇలా అన్నారని వ్రాశావు "ఎవరయితే నిజం పలికి, ఎవరినీ మోసగించకుండా వ్యాపారం చేస్తారో వారు నాతో ఉంటారు" అని లేదా ఇలాంటి అర్థంలోనే హదీసు రాశావు. ఇదంతా నాకూ గుర్తుందని ఆయనగారన్నారు. ఆబిద్ ఖాన్,

రహ్మతుల్లా వెళ్ళిన తరువాత వెళ్ళి చూశాను. రకరకాల బట్టలు కుప్పలు కుప్పలుగా పేర్చారు ప్రతి కుప్పపై ధరల చీటీ ఉంచారు. ధరలేమో చాలా అగువగా ఉన్నాయి. నాకు చాలా ఆశ్చర్యమేసింది.

అప్పుడే కొందరు స్త్రీలు మా వీధివాళ్ళు వచ్చారు. పరదా పాటించేవాళ్ళేమో నా గదిలోకి వెళ్ళిపోయ్యారు. హిందూ సోదరీలేమో తమకు నచ్చిన బట్టలు వెదుక్కోసాగారు. పాపం నా గదిలో కూచున్న పరదా స్త్రీలు నాతో, "కాస్త అబిద్‌గారిని బయటికి వెళ్ళమనండి, మేము మాక్కావలసినవి వెదుక్కుంటా మని ప్రాధేయపడ్డారు.

నాకు నవ్వొచ్చింది. ఆయన్ని ఇంటి బయటికి పంపగానే అందరూ కలిసి బట్టలపై ఎగబడ్డారు. స్త్రీలకు ఆశ, ఈర్ష్య మెండుగా ఉంటుందని ఒప్పుకుంటున్నానక్కా. అప్పుడు ఒకరు తీసుకున్న బట్టే మరొకరూ కావాలనుకునేవారు ఇంతకు అందరూ తమతమకు కావలసిన పీసెస్ తీసుకున్నారు. ఆడవాళ్ళకు ఇంటి పట్టునే ఇష్టమయిన రకాలు అగువగా దొరికాయన్నది నాకు తృప్తి.

దాదాపు రెండు గంటల్లోపల ఆడవాళ్ళల్లోనే 60, 70 రూపాయల సరకు అమ్ముడుపోయింది. జుహర్ వేళ అబిద్ ఖాన్, రహ్మతుల్లా వచ్చారు. ఓ రిక్షా బండిపై సరకు ఎక్కించుకుని బజారుకెళ్ళారు. మగ్‌రిబ్ తరువాత మరలివచ్చారు. చూద్దును గదా జేబుల్లో నోట్లు కుక్కి తీసుకువచ్చారాయన. దాదాపు సగం సరకు అమ్మేశారు. "అమ్మాయిగారూ కాస్త మీ చెంగు—" అన్నారాయన వెలిగిపోతున్న ముఖంతో. నేను నా

ఓణీ పరిచాను. జేబుల్లో నుంచి నోట్లు తీసి పడేశారు. ఆనం దంతో ఒకటే నవ్వు ఆయనగారికీ, నాకూ మహా ఆనందంగా ఉంది.

బజారు సమాచారం చెప్పసాగారు. పి. ఏ,గారికి ఇదేం పిచ్చి పట్టిందని అందరూ ఆశ్చర్యపొయ్యారట. ఎత్తిపొడుపులూ ఎదురయ్యాయట. కొందరయితే ముఖానే అనేశారట—'ఈ కట్ పీస్‌లో ఇంటి గౌరవమే తగలేశావు' అని. కొందరు మంచీ చెడ్డా తెలిసిన పెద్దవాళ్ళు మెచ్చుకున్నారు కూడా. ఎవరికి తోచినట్లు వారు సమీక్షించారన్న మాట. మమ్మల్ని వ్యతిరే కించేవారు కూడా తమకు నచ్చిన ముక్కలు కొనుక్కున్నారట. మాట్లాడనివారు కూడా మాట్లాడారట. వారితో పాత వైరాన్ని మరచి ఆయనగారు అందరితో ఆనందంగా మాట్లాడారన్న విషయం విని నాకు సంతోషమైంది. దైవానికి కృతజ్ఞతాంజలులు సమర్పించుకున్నాను. ఆయనతో—"ఇక ఇది మంచి అవకాశం, మీరు వీరందరితో స్నేహం పెంచుకోండి. ధర్మప్రచార కార్యంలో వీరంతా మీకు సహాయపడవచ్చు. అందువల్లనే దైవ ప్రవక్త (సఅసం) వ్యాపారం చెయ్యాలని ప్రోత్సహించారు. బ్రతుకుతెరువుకు పది మార్గాల్లో తొమ్మిది భాగాలు వ్యాపారం లోనే ఉన్నాయని అన్నారు" అని ప్రోత్సహించాను.

అక్కయ్యా, అనుభవపూర్వకంగా కూడా ఇదే నిజమవు తుంది. ఉపాధి మార్గాల్లో తొమ్మిది వ్యాపారంలోనే ఉన్నాయి. నిజాయితీగా వ్యాపారం చేస్తూ ఇస్లామీయ విధానాలను, నియమా లను పాటిస్తే అతను, ఇస్లామీయ జీవన విధానాన్ని అందరికీ తెలిపే కార్యమూ చెయ్యగలడు. రజియా అన్నయ్యగారు దైవం,

దైవ ప్రవక్త నియమించిన నియమాలను ఆయన సతతం పాటిస్తూ ఉన్నారని, హద్దుల్ని ఎన్నడూ మీరలేదని, అబద్ధం పలకలేదని, ధర కూడా అధికం చేసి లాభాలు ఎక్కువ గడించాలన్న పేరాశకు గురికాలేదని విని మీకూ ఆనందమే కలుగుతుంది కదూ.

రెండవ రోజు అబిద్ ఖాన్, రహ్మతుల్లాగార్ల సలహామేరకు మిగిలిన సరకు సైకిల్‌పై ఎక్కించుకుని పొరుగూరికి వెళ్ళారు. అక్కడా బాగా అమ్ముడుపోయింది. తిరిగివచ్చినప్పుడు చిన్న మూట మటుకు మిగిలి ఉంది. వచ్చీరాగానే రేపు ఢిల్లీ వెళ్ళాలి అన్నారు. సరకంతా అమ్మేశారా అని నేనడిగినదానికి, "అవును, పొరుగూరిలో చిన్న వ్యాపారులు మా సరకు చూసి దర మాట్లాడి అంతా కొనేశారు. ఇంకా తక్కువ లాభంతో నేను ఇచ్చివేశాను. కొన్ని ముక్కలు మటుకు మిగిలాయి" అన్నారాయన.

అక్కయ్యా, తీరూతెన్నూ అయితే బాగానే ఉన్నాయి. దైవచిత్తమయితే మేము నెగ్గుకు రాగలం మీరునూ దుఆ చెయ్యండి ఆయన ఢిల్లీ వెళ్ళివచ్చిన తరువాత తిరిగి వ్రాస్తాను, వివరంగా రాస్తాను.

వస్సలామ్.

బావగారికి సలాములు, సల్మాకు దుఆ..

మీ బుష్రా

# 16

ప్రియమయిన అక్కా!

అస్సలాము అలైకుమ్

పాటింపదగినా, పఠింపదగినా ఘటన నివేదిస్తున్నా. పొద్దున 'వాటు' పట్టణానికి బయలుదేరాను. సుమారు పది గంటల ప్రాంతంలో ఇద్దరు పిల్లలతో వచ్చింది ఒ హిందూ స్త్రీ "రండమ్మా, కూర్చోండి అంతా కుశలమే కదా, ఇలా వచ్చారే?" అనడిగా, ఆమెను మర్యాదగా కూర్చోబెట్టి. రజియా కోసముంచి ఉంచిన రెండు అరటి పండ్లు ఇచ్చా ఆమె ఇద్దరి పిల్లలకి.

ఈ గౌరవమర్యాదలు చూచి ఆమె విలపించసాగింది. 'అయ్యో, దేవుడు మేలుజేయు, ఏంటమ్మా ఇలా కన్నీరు పెడు తున్నారేం?' అనడిగా.

"అమ్మా, నేనొక విధవను. మీ వీధి పక్క సందుకు పక్క మలుపులో ఉంది నా ఇల్లు. దైవం నాకు సమస్తం ప్రసా దించాడు. కాని పతి మరణానంతరం అభాగ్యురాలినయినాను. హైందవ జాతిలో విధవా వివాహం యుక్తమయినది కాదని మీకు తెలిసే ఉంటుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఎవరికయినా సంతానం

-ఉంటే పాపం, ఆ ఆడజన్మ అధోగతి పాలయిందన్నమాటే ! అమ్మా, నాకు ఇద్దరు పసివాళ్ళు ఉన్నారు. 'నా' అన్న దిక్కు లేదు మీ వద్ద నుంచి కరీం భాయిగారు తమ పిల్లలకని గుడ్డలు తీసుకుపోయారు వీళ్ళిద్దరూ చూచారు కాబోలు, "అమ్మా ! మాకూ తెచ్చి పెట్టు అంటూ ఒకటే గోల అమ్మ విషయమేమో ఇలా ఉంది" అంటూ వాపోయి, తన చిరిగిపోయిన పాత జాకెట్టు తీసి చూపించిందామె.

ఆహార లేమి వల్ల ఆమె కడుపు కృశించిపోయింది. కంపించిపోయాను చూడలేక ముఖం చేతులలో దాచుకున్నా, నేనెంత వేల హృదయనో నీకు బాగా తెలుసునక్కా, ఏడ్వటం మొదలెట్టా.

—ఆ తరువాత ఆ హైందవ స్త్రీనీ, ఆమె ఇద్దరు బిడ్డలనూ మిగిలిపోయిన గుడ్డల మూట దగ్గరకు తీసుకెళ్ళాను మూట విప్పి ! 'మీకు నచ్చిన ముక్కలు తీసుకోండమ్మా ! ఆయన మళ్ళీ తేవడానికి వెళ్ళి ఉన్నారు ఓ వారం తరువాత మరో సారి ఇటు వస్తే, మీకూ, మీ పిల్లలకూ మంచి ముక్కలు తీసిస్తా డబ్బు విషయం ఆలోచించకండి. ఇదంతా దైవం ప్రసాదించినదే దేవుని దాసులయిన మానవులకే' అన్నాను. విని సంతోషించిందికాని, చాలా అభిమానవతి, సద్గుణరాలేమో, తనకు అవసరమయిన ముక్కలే తీసుకుంది. నేనెంతగానో చెప్పాను ఆమె వినలేదు. 'పరమేశ్వరుడు నీకు భోగభాగ్యాలు ప్రసాదించుగాక !' అని దీవిస్తూపోయింది.

మూడో రోజు మావారు పట్టణం నుంచి తిరిగి వచ్చారు. ఈసారి ఆయన ఒక్కడే వెళ్ళడం వల్ల ఎక్కడలేని భయం

పుట్టుకువచ్చేది నాకు. అనుభవంలేని మనిషి కదా. ఏం జరుగు తుందో, ఎలా జరుగుతుందో మరి. కాని ఇది కేవలం నా భ్రమ అని తేలింది చదువూ జ్ఞానమున్న వ్యక్తి ఇస్లామీయ సిద్ధాంతా లపై వ్యాపారం చేస్తే— చదువుసంస్కారాలు లేనివానికన్నా ఎన్నో రెట్లు మెరుగ్గా చేయగలడు పట్టణంలో డబ్బు తొందరగా చెల్లించడం చూచి చాలా ఆనందించారట. సేఠ్ రామ్‌జిలాల్ భోలేనాథ్‌గారు వ్యాపార తంతులు ఎన్నో చెప్పారట అనేకం మనకు అంగీకారయోగ్యం కావు. ఉదాహరణకు శేఠ్‌జీ చెప్పారట, "అప్పు తీసుకునేవాళ్ళకు ధర అధికం చెప్పాలి, సరకు డిమాండ్ చూచి ధరలు పెంచాలి." శేఠ్‌జీ బోధనలకు అభినందనలతో తిరస్కరించారట ఇదేం వ్యాపారం అంటూ చాలా ఆశ్చర్యం వేసిందట సేట్‌గారికి! సరే, తన రొఖ్ఖంతో పని సేఠ్‌గారికి. వారికది చెల్లించి "సేఠ్‌జీ, ఓ రోజు దేవునికి ముఖం చూపెట్ట వలసి ఉంది" అన్నారట ఈయనగారు

ఇది విని సేఠ్‌గారు కౌగలించుకుని "క్షమించండి అను భవం వల్ల నాకు తెలిసింది నేచెప్పా. చాలా నిజాయితీపరులు మీరు. నన్ను మన్నించండి. కావలసినంత సరకు తీసు కెళ్ళండి మీ అంగడీగానే భావించండి" అంటూ ఒక్క మూటకు బదులుగా రెండు మూటలు స్టేషన్‌కు పంపించి రెంటికీ చేర్చి బిల్ ఇచ్చారట బయలుదేరేటప్పుడు. ఇదీ లాభానికి అలవాటుపడ్డవాని తత్వం!

ఇక చూడు. కాని ఖర్చు లేకుండా రెండు మూటలు ఇంట చేరాయా? అబద్ధం చెప్పనిదే వ్యాపారం సాగదంటారు జనులు. కాని సత్యం లేనిదే వ్యాపారం నడవదంటుంది మా

అనుభవం! ప్రస్తుతం జీవనోపాధి దుర్లభంగా ఉందంటారు ప్రజలు కాని మా అనుభవమో? జీవనోపాధి మనుషుల్ని వెదుక్కుంటూ ఉంది. చేసేవాడు కావాలి. నిజాయితీ విశ్వాసాలతో కృషి చేస్తే దేవుడూ అనుగ్రహిస్తాడు. మరి దైవ ప్రసన్నత అభిలషించి ఈ కృషినంతా చేసేవాని గూర్చి వేరే చెప్పాలా?

అక్కయ్యా! ఈ ఒకటిన్నర నెలల అనుభవంలోనే ధర్మ సంపద ఇంటచేరింది బాగానేచేరింది. కష్టపడటం వల్ల వారి ఆరోగ్యమూ బాగుపడింది. ముందు ఉద్యోగంలో ఉన్నప్పుడు రొట్టెలు రెండే తిని అజీర్ణమంటూ బాధపడేవారు. ఇప్పుడు అలాంటి బాధంటూ లేదు. ఉద్యోగ కాలంలో భిక్షగాళ్ళకు ఏదైనా ఇస్తే నేనే ఇవ్వాలి, అంతే. ఆయన మాత్రం చిల్లిగవ్వ పడేసేవారుకాదు. మరి ఇప్పుడో? యాచకుడు—"దేవుడు మేలు చేయు" అంటూ చేయి చాచి అడగకముందే అణో, బేడో చేతి కందింది ఇచ్చివేస్తున్నారు ప్రజలతో సంబంధం పెరుగుతూ ఉంది. స్నేహితులు. ప్రియాభిలాషులు అధికమే అవుతున్నారు వేల మంది రోజూ కనుల ముందు మసలుతుంటారు వందలకొద్దీ మనుషులతో మాట్లాడే అవకాశం కలుగుతుంది. రెండు మూడు రోజులకు ఓ మిత్రుడు దీన్, సత్కార్యాల్లో తోడ్పడేవాడు లభిస్తూనే ఉంటాడు మొన్న శుక్రవారంనాడు మౌలానాగారి ఖుత్బా బోధన, అందులో సత్కార్యాలను విస్తరింపజేయడానికి, దుష్కర్మలను నిర్మూలించడానికి, ధర్మసంపాదన కోసమే జీవితాంతమూ కృషి చేయడానికి అందరూ ప్రతిజ్ఞబూనారు. తాను చేసే ప్రతి కార్యం దైవ ప్రసన్నత కొరకే చేయడంలో మావారికి సహకరించబూనుకున్నవారు 11 మంది.

... అక్కయ్యా చెప్పాలంటే బోలెడంత ఉంది. వ్యాపారం లోని లాభాలు, ఆర్థికంగానూ, ధార్మికంగానూ అగణ్యంగా ముందుకువచ్చాయి. నాకు వీలయితే ప్రతి వ్యక్తినీ వ్యాపారానికి బలవంతపెట్టేదాన్ని వీధిలోని వ్యతిరేకులు ఒక్కొక్కరే కలుస్తు న్నారు మాతో. గతించినదాన్ని మరచి సరికొత్త స్నేహం పెం పొందిస్తున్నారు. "పూర్తిగా అంధకారంలో ఉన్న మమ్మల్ని ఇక్కడి 'అర్ధ మౌల్వీలు' ఇస్లామ్ గురించి ఏదో చెప్పి మరింత అంధకారంలో పడేశారు" అంటారిప్పుడు అందరున్నూ.

ఇక అఖ్తర్ సాహెబ్ మనస్సు వ్యాపారంలో బాగా స్థిర పడింది. తన పరీక్ష నుంచి మమ్మల్ని కాపాడినందుకు దేవునికి అనేక ధన్యవాదాలు. ఇప్పుడు "అఖ్తరుల్ ఇస్లామ్"గారు పి. ఏ. కాదు, "అఖ్తర్ సాహెబ్" మరికొందరికి "కట్ పీసెస్ అన్నయ్య." నేనూ కొన్ని ముక్కలు ఉంచుకుంటాను ఇంట్లో. పర్దా స్త్రీలకు సులువుగా సరసమయిన ధరలకు మంచి బట్టలు లభిస్తాయి. వంటలు ముగించుకుని, పిల్లలకు పాఠాలు చెప్పాకా పర్దా స్త్రీల సేవలోనే నిమగ్నమై ఉంటాను. మాటలలో సన్మార్గ విషయం ఏదో ఒకటి చెబుతూనే ఉంటా! ఇక దైవ మార్గం అనుసరించడం వారి వంతు.

ఒక్క వ్యక్తిని సంస్కరించడంలో చాలా రోజులు పట్టాయి. అక్కయ్యా! నీ సలహాలు అనుసరించాను. దేవుడు సహాయం చేశాడు. ఇప్పుడు నాకు మేరల్లేని ఆనందం! సర్వవిధాలా ఆనందం !! దయామయుడు దేవుడు పుష్కలంగా అన్నవస్త్రాలు ప్రసాదించాడు. 'వారూ' తృప్తిగా ఉన్నారు. ఉద్యోగంలోకన్నా ఎన్నో రెట్లు మెరుగైన ధర్మ సంపద ఆర్జిస్తూ తింటున్నాం. దాన

ధర్మాలూ జరుగుతున్నాయి. నా పట్లనూ అమిత ప్రేమగా వ్యవహరిస్తారు వారు. ధర్మ సంపద, దీన్, సన్మార్గ సేవన, ప్రేమించే భర్త. ఇంకేం కావాలి ఓ మహిళకు ?

అక్కయ్యా ! సర్వస్వమూ లభించింది నాకు వేనవేల ధన్యవాదాలు. ఈ జీవితం ప్రసాదించిన ప్రభువుకు, మీ కొరకు నా ప్రతి రోమమూ ప్రార్థిస్తూ ఉంది.

వస్సలామ్.

సదా నీ శ్రేయాన్ని కోరే

బుష్రా.

—: సమాప్తం :—